మన

# రైతువాణి

వ్యవసాయ మాసపత్రిక

ఏప్రిల్ : 2022



రైతు సోదరులకు

## ఉగాది శుభాకాంక్షలు













## విజయవాడలో రైతు గర్జన






రైతు గర్జన సందర్భంగా విజయవాడలో అరెస్టులు



గోవాడ సుగర్ ఫ్యాక్టరీ సమస్యలపై ధర్నా (విశాఖ జిల్లా)



ఇసుక అక్రమ తవ్వకాలపై నిరసన (చిత్తూరు జిల్లా)



కల్తీ పత్తివిత్తనాలతో నష్టపోయిన రైతుల నిరసన (కర్నూలు జిల్లా)



పంట నష్టాలపై కలెక్టరుకు వినతిపత్రం (అనంతపురం)



జంగారెడ్డి గూడెంలో రైతుల నిరసన (ప.గోదావరి జిల్లా)




రైతు, వ్యవసాయ కార్మిక సమస్యలపై (ఆత్మకూరు)




విద్యుత్తు ఛార్జీలు తగ్గించాలని (బుక్కరాయపట్నం)

మన
# రైతువాణి
ఏప్రిల్ - 2022
సంపుటి : 32 సంచిక : 4
వెల : రూ. 25 పేజీలు : 52
సంవత్సర చందా : రూ. 250/-

ఎడిటర్
పి. నరసింహారావు
సెల్ : 9490098222

ఎడిటోరియల్ బోర్డు
వై. కేశవరావు
మర్రాపు సూర్యనారాయణ

చీఫ్ రిసోర్స్ పర్సన్
ప్రొ. ఎన్. వేణుగోపాలరావు
ఎం.ఎస్.సి.(ఎజి) పి.హెచ్.డి.

బ్యూరో చీఫ్
యు. రామకృష్ణ
సెల్ : 94900 99200

మార్కెటింగ్ మేనేజర్
మన్నెం శ్రీనివాసరావు
సెల్ : 79700 99227

సర్క్యులేషన్ : యం. పార్వతి
సెల్ : 96769 55885

మన రైతువాణి
3/4బి, వడ్డేశ్వరం బైపాస్, వడ్డేశ్వరం (పోస్ట్)
తాడేపల్లి మండలం, గుంటూరు జిల్లా
పిన్ : 522 502
E-mail : rytuvani@gmail.com

చెక్కులు, డి.డి లు Mana Rytu vani
పేరుతో పంపాలి.
SBI Ac No : 52024133051
IFSC : SBIN0020343

## విషయసూచిక


వికాసం
SATISH ACHARYA


SIFY.COM
దైవ ఘటన
నువ్వు జాతి వ్యతిరేకి
SATISH ACHARYA

# గీతోపదేశాలు


ప్రధాని పట్టించుకుంటారు. విడతల వారీగా మమ్మల్ని దోచుకున్నందుకు ధన్యవాదాలు!
ఇంధన ధరలు రోజువారీ పెంపు
SATISH ACHARYA


దేశాన్ని ఇబ్బంది పెట్టే బడ్జెట్
SATISH ACHARYA


సంతోషం లేదా?. మీరింకా 'కాశ్మీర్ ఫైల్స్' చూడలేదా
SATISH ACHARYA

సంపాదకీయం... 

# నిర్బంధాలతో రైతు ఉద్యమాలను ఆపలేరు

తమది రైతు ప్రభుత్వం అని చెప్పిన రాష్ట్ర ప్రభుత్వం.. రైతు గర్జన సభను నిర్బంధాలతో అణచివేయడానికి విఫలయత్నం చేసింది. ప్రజాస్వామ్యబద్ధంగా నిరసన తెలిపే హక్కు ఉన్నా.. అప్రజాస్వామికంగా నిరసనలను అణిచివేయడానికే నిశ్చయించుకున్నట్లు ప్రస్తుత ప్రభుత్వం వ్యవహరిస్తున్న తీరుకు అద్దం పడుతున్నది. వందలాది మంది పోలీసులను దింపి నిరసనలపై ఉక్కుపాదం మోపడం గత ప్రభుత్వ వారసత్వంగా ఈ ప్రభుత్వం స్వీకరించినట్లుంది. తాను ప్రతిపక్ష నాయకుడుగా ఉన్నప్పుడు ప్రజా విజ్ఞప్తులు తీసుకునే సందర్భంలో ప్రస్తుత ముఖ్యమంత్రి జగన్మోహనరెడ్డి గారు ఎన్నో వాగ్దానాలు చేశారు. తాను అధికారంలోకి వచ్చాక రైతు సమస్యలు పరిష్కరించి మాట నిలబెట్టుకుంటానని చెప్పి.. ఇప్పుడా సమస్యలను పట్టించుకోకపోగా, నిరసన వ్యక్తం చేస్తున్న వారిపై ఉక్కుపాదం మోపుతున్నారు. గత నెలలో ప్రభుత్వ ఉద్యోగుల, ఉపాధ్యాయుల ప్రదర్శనను అలాగే అణచివేయబూని వెల్లికలా పడ్డారు. ఎన్ని అవరోధాలు కల్పించినా వెల్లువలా వచ్చిన ఉద్యోగుల గర్జనతో రాష్ట్ర ప్రభుత్వం షాకైంది. ఇక ఏ నిరసనలు చేపట్టినా వరుసబెట్టి వాటికి అనుమతి నిరాకరించడం మొదలుపెట్టింది. విద్యార్థులపై లాఠీచార్జీలు చేయించడం, అంగన్‌వాడీ, ఆశా వర్కర్ల సభలకు అడ్డంకులు సృష్టించడం ఘనం చూసిందే. ఇప్పుడు తాజాగా రైతు సమస్యలపై చేపట్టిన రైతు గర్జన సభకు అనుమతి నిరాకరించి పెద్ద ఎత్తున పోలీసులను ఉపయోగించారు. అయినా రైతు గర్జనను ఆపలేకపోయారు.

రాష్ట్రంలో అన్నింటా దగా పడుతున్న అన్నదాతల ఆక్రందనలు, ఆత్మహత్యలు ఎంతో ఆందోళన కలిగిస్తుంటే.. రోమ్ నగరం తగులబడిపోతుంటే నీరో చక్రవర్తి ఫిడేలు వాయించినట్లుగా ఉంది ఈ రాష్ట్ర ప్రభుత్వ వ్యవహార శైలి. ఇటీవల కాలంలో రాయలసీమలో భారీ వర్షాలు, వరదలు తెచ్చిన ముప్పు అంతా ఇంతా కాదు. వరద కారణంగా వేలాది ఎకరాల్లో మేట వేసింది. ఈ కారణంగా రైతులు, ముఖ్యంగా కౌలు రైతులు దారుణంగా దెబ్బతిన్నారు. ఈ స్థితిలో ప్రభుత్వం వారిని ఆదుకోవాల్సింది పోయి ప్రేక్షక పాత్ర వహించింది. నవంబరు, డిసెంబరు నెలల్లో కురిసిన వానలు, వరదలు, తెగుళ్ల కారణంగా పత్తి, మిర్చి పంటలు నాశనమయ్యాయి. దీనితో పైర్లను పీకేయాల్సి వచ్చింది. దీనికీ ప్రభుత్వం నుంచి స్పందన లేదు. ఉభయ గోదావరులు, కృష్ణా, గుంటూరు జిల్లాల్లో 30 లక్షల నుంచి 40 లక్షల ఎకరాల్లో వరిపైరు వర్షపు నీటిలో మునిగిపోయింది. దీనివల్ల ఎకరానికి సరాసరి 15 నుంచి 20 బస్తాలు దిగుబడి చేతికి రాకుండా పోయింది. అసలే ప్రభుత్వం ఇచ్చే మద్దతు ధర గిట్టుబాటు గాక రైతు నానా అగచాట్లు పడుతుంటే తడిసిన ధాన్యానికి ధర మరింత పతనమైంది. రైతుల కోసమే రైతు భరోసా కేంద్రాలన్నారు. ఎక్కడా రైతులను ఆదుకున్న పరిస్థితి లేదు. ఐదు లక్షల ఎకరాల్లో మిర్చి నాశనమైపోయింది. రాష్ట్రంలో సుమారు 40 లక్షల ఎకరాల్లో వివిధ పంటలు చేతికి రాకుండా పోతే కేవలం నాలుగున్నర లక్షల ఎకరాలకు మాత్రమే ఎకరానికి రూ.ఆరు వేల చొప్పున పరిహారమిచ్చి ప్రభుత్వం చేతులు దులుపుకుంది. రాష్ట్రంలో కౌలు రైతుల ఆత్మహత్యలకు అంతేలేదు. ఇంతటి విపత్కర పరిస్థితుల్లో తమ సమస్యలను ప్రభుత్వానికి నివేదించుకోవడానికి రాష్ట్రంలోని రైతు సంఘాల సమన్వయ కమిటీ రైతు గర్జనకు పిలుపు ఇచ్చింది. అయితే దీన్ని నిర్వహించుకోవడానికి ప్రభుత్వం అనుమతి నిరాకరించింది. రైతులు తమ గోడు వెళ్లబోసుకోవడానికి విజయవాడకు వెళ్లనీయకుండా ఈ ప్రభుత్వం అత్యంత నీతిబాహ్యమైన, హేయమైన పద్ధతులను అనుసరించింది.

రాష్ట్రంలోని ప్రతి గ్రామం, ప్రతి మండలం, ప్రతి జిల్లా నుంచి రైతులను, రైతు కార్యకర్తలను, రైతు నాయకులను రైతు గర్జనకు పోవద్దంటూ నోటీసులు ఇచ్చింది. వారి ఇళ్లలోనే వారిని బందీలను చేసింది. ఉదయం నుంచి సాయంత్రం వరకూ పోలీసులతో కాపలా కాయించింది. అరెస్టులకు తెగబడింది. విజయవాడకు బయల్దేరిన రైతులను ఉన్నఫళంగా రైల్వే స్టేషన్లలో, రైళ్లలో, బస్‌స్టేషన్లలో, బస్సుల్లో అక్కడ ఇక్కడ అని తేడా లేకుండా కనపడిన చోటల్లా వారిని ముందుకు పోకుండా అరెస్టులు చేసి పోలీసు స్టేషన్లకు తరలించింది. విజయవాడ రైల్వే స్టేషన్‌కు చేరుకున్న వందలాది మంది రైతులను అరెస్టు చేసి గర్జనకు రానీయకుండా చేసింది. అయినా రైతు గర్జన విజయవంతంగానే జరిగింది. రైతు సమస్యలు ఎలుగెత్తి చాటబడ్డాయి. ఈ గర్జన సభకు వచ్చిన అఖిల భారత రైతు నాయకులు రాష్ట్ర ప్రభుత్వం వ్యవహరించిన అప్రజాస్వామిక విధానానికి తీవ్ర నిరసన వ్యక్తం చేశారు. ప్రజాస్వామ్య బద్ధంగా నిర్వహించుకునే నిరసనలపై ఉక్కు పాదం మోపితే గత ప్రభుత్వానికి పట్టిన గతే పడుతుందని, ప్రభుత్వం ఇప్పటికైనా రైతాంగ సమస్యల పరిష్కారానికి నడుంకట్టాలని, లేకుంటే రైతులు ఈ ప్రభుత్వాన్ని సాగనంపుతారని నాయకులు హెచ్చరించారు.



# స్థాయీ సంఘం సిఫార్సులు ఎరువుల సమస్యను పరిష్కరిస్తాయా?



**వై. కేశవరావు**

ఈ ఏడాది రబీ సీజనులో జనవరి-ఫిబ్రవరి మాసాల్లో ఎరువులు దొరక్క రైతులు నానా అవస్థలు పాలయ్యారు. ఎరువుల దుకాణాల వద్ద బారులు తీరాల్సి వచ్చింది. ప్రయివేటు డీలర్లు స్టాకు లేదని చెపుతూనే రూ.267లకు అమ్మాల్సిన యూరియా బస్తాను రూ.420లకు పైగా అమ్మారు. కొందరు యూరియా బస్తా కావాలంటే అదనంగా కాంప్లెక్స్ ఎరువు బస్తా తీసుకోవాలని షరతు పెట్టి అక్కరలేని ఎరువులు అంటగట్టారు.

కేంద్ర ప్రభుత్వం నియమించిన పార్లమెంటరీ స్థాయీ సంఘం రబీ సీజను పూర్తి కావస్తున్న దశలో మార్చి 21న తన రిపోర్టు ఇచ్చింది. ఆ రిపోర్టులో ప్రధానంగా నాలుగు సూచనలున్నాయి. 1: బడ్జెట్‌లో ఎరువులకు కేటాయింపులు పెంచాలి. 2 : వ్యవసాయ సీజన్‌లో ఎరువులు అందక ఏ రైతూ ఇబ్బంది పడకుండా రాష్ట్ర ప్రభుత్వాలు చూడాలి. 3 : కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల వ్యవసాయ శాఖలు 'ఫెర్టిలైజర్ కంట్రోల్ ఆర్డరు 1985' అనుసరించి కఠిన చర్యలు తీసుకోవాలి. 4 : హోల్‌సేల్, రిటైల్ షాపుల్లో ఎరువుల నిల్వలు, వాటి ధరలు తెలుపుతూ డ్యాష్ బోర్డులు ఏర్పాటు చేయాలి. అయితే ఎరువుల కొరత, దానికి కారణాలు, తగిన చర్యలు సూచించలేదు.

దేశంలో ఏటా 50 బిలియన్ టన్నుల ఎరువులు అవసరం వుందని అధికారులు అంచనా వేశారు. ఈ ఎరువుల్లో 80 శాతం విదేశాల నుంచి దిగుమతి చేసుకోవాల్సి ఉంది. అవసరమైన పొటాష్ 100 శాతం దిగుమతి చేసుకోవాలి. నత్రజని, సూపర్ 70 శాతం దిగుమతి చేసుకోవాలి. ఇందుకు అవసరమైన బడ్జెట్ కేటాయించాలి. 2020-21లో ఎరువులపై రూ.1,28,361 కోట్ల సబ్సిడీ కేటాయించింది. 1921-22లో రూ.1,40,703 కోట్లు కేటాయించింది. ఇలా భడ్జెట్‌లో కేటాయింపులు చేసినప్పటికీ ఖర్చు చేయడంలో కోత పెడుతున్నారు. ఎరువుల దిగుమతి డాలర్లలో చేసుకోవాల్సి ఉంది. డాలరులో రూపాయి విలువ పడిపోయిన మేరకు ధరలు పెరుగుతాయి. ఆ మేరకు దిగుమతులకు కోత పడుతుంది. బడ్జెట్ సమయంలో యే ఎరువు ఎంత కావాలో, యే రాష్ట్రానికి ఎంత కావాలో, యే కాలంలో సరఫరా చేయాలో కాగితాలపైనే వుంటుంది. ఈ ఏడాది రబీ కాలంలో సరిగ్గా ఫిబ్రవరి-మార్చి నెలల్లో ఉత్తర ప్రదేశ్ ఎన్నికలు వచ్చాయి. ఆంధ్ర, బీహార్ రాష్ట్రాలకు రావాల్సిన ఎరువులు ఉత్తరప్రదేశ్‌కు చేరాయని బాహాటంగానే వార్తలు వచ్చాయి.

డబ్ల్యుటివోతో ఒప్పందంలో చేరిన అనంతరం వచ్చిందే 1985 యాక్టు. అప్పటివరకూ ప్రతి తాలూకాలో సహకార రంగంలో అగ్రికల్చర్ మార్కెటింగ్ ఫెడరేషన్ ఉండేది. ఆ కమిటీల ద్వారా రైతులకు కావాల్సిన ఎరువులు సక్రమంగా సరఫరా అయ్యేవి. అప్పటివరకూ ప్రభుత్వ రంగంలోనూ, సహకార రంగంలోనూ పనిచేసేవి. దిగుమతి చేసుకున్న ముడి సరుకులను అవసరమైన ఎరువులుగా తయారు చేసి సకాలంలో అందించేవి. 1985 అనంతరం ప్రభుత్వ పాలసీలో మార్పులు వచ్చాయి. ప్రయివేటు కంపెనీలు రంగంలోకి వచ్చాయి. ప్రభుత్వ, సహకార ఫ్యాక్టరీలపై ఆంక్షలు పెరిగాయి. ప్రభుత్వ, సహకార కంపెనీలు తమ

ఉత్పత్తి సామర్థ్యానికన్నా అదనంగా తయారు చేస్తున్నాయి. 1997-98లో 118 శాతం ఉత్పత్తి సాధించిన కంపెనీలు 2009-10 నాటికి 79 శాతం, 2014-15 నాటికి 66 శాతానికి తగ్గించి వేయబడ్డాయి. ఫలితంగా ప్రయివేటు కంపెనీలు సబ్సిడీపై ముడి సరుకులు లేదా ఎరువులు కొని కాంప్లెక్సులుగా మార్చి తిరిగి సబ్సిడీ పొందుతున్నాయి. ఒకే బస్తా ఎరువుకు రెండు సార్లు సబ్సిడీ పొంది లాభాలు గడిస్తున్నాయి. పేరుకు సబ్సిడీ ఏటా పెంచినట్లు బడ్జెట్‌లో చూపుతున్నా పైవిధంగా ప్రయివేటు వ్యాపారులు రెట్టింపు సబ్సిడీ పొంది లాభాలు గడిస్తున్నారు. ఆచరణలో ఎరువులపై సబ్సిడీ పెంచినట్లుగా కనపడుతున్నా ఎరువుల ప్రమాణం తగ్గి కొరతకు కారణం అవుతోంది.

రెండు తెలుగు రాష్ట్రాల్లో రసాయన ఎరువుల వాడకం ఎక్కువగా ఉందని, వాటిని తగ్గించి ఆర్గానిక్ ఎరువులు వాడకం చేపట్టాలని ప్రభుత్వం చెపుతోంది. రసాయన ఎరువుల కన్నా ఆర్గానిక్ ఎరువుల ధరలు అధికంగా ఉండటంతో మన దేశంలో సన్న, చిన్నకారు రైతులు 90 శాతం మంది వాటిని కొనలేక రసాయనిక ఎరువులపైనే ఆధారపడటం జరుగుతోంది. రైతులందరికీ సాయిల్ హెల్త్ కార్డులు ఇస్తామని, వాటి ఆధారంగా యే ఎరువు యే మోతాదులో వాడాలో తెలుస్తుందని చెప్పారు. ఆ పథకం కూడా సక్రమ అమలుకు నోచుకోలేదు.

గతేడాది బడ్జెట్‌లో రూ. 1,40,703 కోట్లు కేటాయించగా ఈయేడు 1,05,262 కోట్లు మాత్రమే కేటాయించారు. రూ. 35 వేల కోట్ల బడ్జెట్ నిధులు తగ్గించారు. దీనితోపాటు ఎప్పటికప్పుడు పెట్రోలియం, రసాయనాల ధరలు పెరుగుదల వల్ల ఎరువుల ధరలు మరింత పెరిగే అవకాశం ఉంది. ఈ అంశాలేవీ పరిశీలించకుండా డ్యాష్ బోర్డులు పెట్టడం వల్ల సమస్య పరిష్కారం కాదు. ఇప్పటికైనా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చర్చించి సక్రమమైన ఎరువుల ధరలు, సరఫరా విధానాన్ని రూపొందించడం అవసరం.

(వ్యాసరచయిత : ఎపి రైతు సంఘం రాష్ట్ర అధ్యక్షులు)

## 11న అఖిలభారత కిసాన్ సభ ఆవిర్భావ దినోత్సవం జరపండి

స్వామి సహజానంద సరస్వతి అధ్యక్షుడుగా 1936, ఏప్రిల్ 11న లక్నోలో అఖిల భారత కిసాన్ సభ (ఎఐకెఎస్) ఏర్పడింది. కిసాన్‌సభ స్వాతంత్ర్యోద్యమంలో రైతాంగాన్ని కదిలించడంలో ప్రముఖ పాత్ర వహించింది. బ్రిటీష్ అధికారుల కంపెనీల దురాగతాలకు వ్యతిరేకంగా పోరాటాలు సాగించింది. నిరంకుశ పాలనకు మారుపేరైన జమీందారీ విధానం రద్దు కోసం, దున్నేవాడికే భూమి కోసం, వెట్టి చాకిరి విముక్తి కోసం దేశవ్యాపితంగా పోరాటాలు నిర్వహించింది.




స్వాతంత్ర్యానంతరం సాగునీటి ప్రాజెక్టుల కోసం, పంటలకు మద్దతు ధరల కోసం, బంజరు, మిగులు భూముల పంపంకం కోసం ఎనలేని పోరాటాలు సాగించింది. కౌలు రైతుల, వ్యవసాయ కార్మికుల హక్కుల సాధన కోసం, వేతనాల కోసం పోరాటాలు సాగించింది. రైతులను ఆత్మహత్యల నుంచి కాపాడాలని రుణ భారం నుంచి విముక్తి చేయాలని ఉద్యమాలు నడిపింది.

గతేడాది కేంద్ర ప్రభుత్వం తెచ్చిన మూడు వ్యవసాయ నల్ల చట్టాలు రద్దయ్యే వరకూ ప్రాణాలను సైతం లెక్క చేయకుండా సంయుక్త కిసాన్ మోర్చా జరిపిన పోరాటాల్లో ప్రధాన పాత్ర పోషించింది. రైతాంగ సమస్యలతోపాటు కార్మిక వర్గం హక్కులు హరిస్తూ తీసుకువచ్చిన కార్మిక కోడ్‌లు రద్దు చేయాలనే డిమాండ్‌పై కార్మికవర్గంతో కలిసి పోరాడుతోంది. మూడు నల్ల చట్టాలను రద్దు చేసిన ప్రభుత్వం.. మద్దతు ధరల గ్యారంటీ చట్టం, కేరళ తరహా రుణ ఉపశమన చట్టం, విద్యుత్తు సవరణ చట్టాలపై రాతపూర్వకంగా ఇచ్చిన హామీ అమలును దాటవేస్తోంది. ఆ చట్టాలు సాధనకు రెండో విడత పోరాటానికి ఎఐకెఎస్ సిద్ధం అవుతోంది. ప్రతి గ్రామంలో రైతు సంఘం పెట్టాలని, ప్రతి రైతూ సంఘంలో చేరాలని పిలుపు ఇచ్చింది. ఏప్రిల్ 11న ప్రతి గ్రామంలో కిసాన్‌సభ ఆవిర్భావ దినోత్సవాన్ని జరపాలని ఎఐకెఎస్ పిలుపునిచ్చింది. రైతు-వ్యవసాయ కార్మిక-కార్మిక ఐక్యత వర్థిల్లాలని గ్రామ గ్రామాన నినదించాలని ఎఐకెఎస్ ఇచ్చిన పిలుపును జయప్రదం చేయాలి. ఆ రోజు ప్రతి గ్రామంలోఎఐకెఎస్ పతాకాలతో ప్రదర్శనలు, సభలు నిర్వహించాలని కిసాన్ సభ పిలుపు నిచ్చింది.

# వ్యవసాయ కార్పొరేటీకరణకు బాటలు




రాష్ట్ర ప్రభుత్వం ప్రతిపాదించిన వ్యవసాయ బడ్జెట్ రాష్ట్రంలో వ్యవసాయ కార్పొరేటీకరణ శీఘ్రతరానికి బాటలు వేసింది. కేంద్రానికి మల్లే సేద్యంలో పెద్ద ఎత్తున డ్రోన్లను ప్రవేశపెడతామని ప్రకటించింది. వచ్చే ఏడాదిలో రైతు భరోసా కేంద్రాల్లో (ఆర్‌బికె) పది వేల డ్రోన్లను అందుబాటులో ఉంచుతామంది. ఆర్‌బికెల స్థాయిలో ప్రకృతి వ్యవసాయంపై ప్రత్యేక శిక్షణనిచ్చేందుకు కమ్యూనిటీ సెంటర్లను (సిహెచ్‌సి) నెలకొల్పుతామంది. ప్రకృతి, సేంద్రీయ వ్యవసాయ విధానాన్ని అమలు చేస్తామని, ఆ ఉత్పత్తుల ధ్రువీకరణ సంస్థను ఎపి సీడ్స్‌కు అనుబంధంగా ఏర్పాటు చేస్తామంది. విదేశీ, స్వదేశీ సంస్థలతో ఆహార శుద్ధి యూనిట్లు తీసుకొస్తామంది. పంట ఉత్పత్తుల మార్కెటింగ్‌కు ఇ-నామ్ బలోపేతం, ఈ-ఫార్మ్, ఎపి మార్క్‌స్‌లను ప్రతిపాదించింది. చేపల అమ్మకాలకు 70 ఆక్వా హబ్‌లు, 14 వేల రిటైల్ అవుట్‌లెట్లను నెలకొల్పుతామంది. సహకార సేవలను ఆర్‌బికెలతో అనుసంధానిస్తామంది. 2022-23 ఆర్థిక సంవత్సరానికి వ్యవసాయ బడ్జెట్‌ను సంబంధిత శాఖ మంత్రి కురసాల కన్నబాబు, మండలిలో మంత్రి సీదిరి అప్పలరాజు ప్రవేశపెట్టారు. తమ ప్రభుత్వం రైతుల పక్షపాతి అని, వివిధ పథకాలు, కార్యక్రమాలతో అన్నదాతలకు వెన్ను దన్నుగా నిలిచిందని కన్నబాబు చెప్పారు. రైతు బాగుండాలి, వ్యవసాయం వర్ధిల్లాలన్నదే తమ అభిమతమని పేర్కొన్నారు. అందుకే పలు అవార్డులు, ప్రశంసలు తమకు లభించాయని వివరించారు. రైతు భరోసా, ఉచిత పంటల బీమా, ధరల స్థిరీకరణ నిధి, విపత్తు నిధి, సున్నా వడ్డీ, ఉచిత విద్యుత్ తదితర పథకాలను బడ్జెట్ ప్రసంగంలో సుదీర్ఘంగా విశదీకరించారు.

### డ్రోన్ పైలట్ శిక్షణ

రైతులకు కూలీల ఖర్చు తగ్గించేందుకు పురుగుమందులు, ఎరువుల పిచికారీ, విత్తనాలు వెదజల్లడానికి డ్రోన్లు ప్రవేశపెడతారు. అన్ని ఆర్‌బికెలలో 10 వేల డ్రోన్లను దశలవారీగా రాయితీపై సరఫరా చేస్తారు. వాటి నిర్వహణ కోసం గ్రామీణ యువతకు డ్రోన్ పైలట్ శిక్షణ ఇస్తారు. వచ్చే ఏడాది వ్యక్తిగతంగా వ్యవసాయ యంత్ర పరికరాలు రాయితీపై ఇస్తారు. ఎఫ్‌పిఓల ద్వారా ప్రాసెసింగ్ యూనిట్లు

| ముఖ్య ప్రతిపాదనలు | రూ.కోట్లు |
|---|---|
| రైతు భరోసా | 7,020 |
| ఉచిత పంటల భీమా | 1,802 |
| సున్నా వడ్డీ | 500 |
| సీడ్ సబ్సిడీ | 200 |
| విపత్తు సహాయ నిధి | 2,000 |
| ధరల స్థిరీకరణ నిధి | 500 |
| ప్రకృతి సేద్యం శిక్షణ | 200 |
| యాంత్రీకరణ | 200 |
| ఎక్స్‌గ్రేషియా | 20 |
| మార్కెటింగ్ | 614 |
| సహకారం | 248 |
| ఫుడ్ ప్రాసెసింగ్ | 146 |
| హార్టి కల్చర్ | 554 |
| సెరీ కల్చర్ | 99 |
| వ్యవసాయ వర్శిటీ | 421 |
| హార్టికల్చర్ వర్శిటీ | 59 |
| వెటర్నరీ వర్శిటీ | 122 |
| పశు సంవర్థకం | 1,027 |
| మత్స్యశాఖ | 337 |
| ఉచిత విద్యుత్ | 5,000 |
| ఉపాధి హామీ | 8,328 |
| జలకళ | 50 |
| ఇరిగేషన్ | 11,450 |

నెలకొల్పుతారు. దశలవారీగా ఆర్‌బికెలకు శాశ్వత భవనాలు నిర్మిస్తారు. వాటికి అనుసంధానంగా దశలవారీగా అగ్రి ఇన్‌ఫ్రా ఫండ్‌తో మల్టీపర్పస్ ఫెసిలిటీ సెంటర్లు ఏర్పాటు చేస్తారు. పిఎసిఎస్‌లలో 103 పెట్రోల్ బంక్‌లను ఏర్పాటు చేస్తారు. 111 దేశీయ, విదేశీ సంస్థలతో ఫుడ్ ప్రాసెసింగ్ యూనిట్లు నెలకొల్పడానికి ప్రణాళిక సిద్ధం చేశారు. ఆయిల్‌పామ్‌సహా వచ్చే ఏడాది 1.75 లక్షల ఎకరాలను అదనంగా ఉద్యాన పంటల కిందకు తెస్తారు. సుమారు 11 లక్షల ఎకరాలు ఆయిపామ్ కిందకు తీసుకొచ్చే అవకాశం వుందని గుర్తించారు.

### జిల్లా కేంద్రంలో విశ్రాంతి భవనం

కొత్త జిల్లాలతోసహా ప్రతి జిల్లాలో రైతులు విశ్రాంతి తీసుకోడానికి వసతి గృహాలు నిర్మిస్తారు. జాతీయ స్థాయిలో .2020-21లో వ్యవసాయ వృద్ధి రేటు 7.5 శాతం కాగా ఎపి వృద్ధి రేటు 10.39 శాతం. 2021-22లో జాతీయ వృద్ధి రేటు 9.8 శాతం కాగా ఎపిలో 14.5 శాతం. ఈ ఏడాది రికార్డు స్థాయిలో 179 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు లభిస్తాయని అంచనా వేశారు. చిరుధాన్యాల సాగు పెంపునకు పాలసీ అమలు చేస్తారు.

### భారీ కోత

ఎప్పటికి మాదిరిగానే వ్యవసాయ బడ్జెట్‌లో ఇతర శాఖల పద్దులు చేర్చారు. గతంలో ఉపాధిహామీ, ఉచిత విద్యుత్ చేర్చగా ఈ తడవ అదనంగా ఇరిగేషన్ పద్దును కలిపారు. దాంతో 2021-22 వ్యవసాయ బడ్జెట్ రూ.31,256.36 కోట్లు కాగా వచ్చే ఏడాది రూ.43,052.78 కోట్లకు పెరిగింది. ఇరిగేషన్ బడ్జెట్ రూ.11,450.94 కోట్లు పోతే పెరిగిందేమీ లేదు. ఇదిలా ఉండగా వ్యవసాయ అనుబంధ రంగాల మట్టుకు 2021-22లో రూ.13,517 కోట్లు (5.88 శాతం) ప్రతిపాదించి 11,942 కోట్లకు (5.74 శాతం) తగ్గించారు. వచ్చే ఏట 13,630 కోట్లు (5.32 శాతం) ప్రతిపాదించారు. గత బడ్జెట్ ప్రతిపాదన కంటే 1,437 కోట్లు (0.56 శాతం), సవరించిన బడ్జెట్ కంటే 1,077 కోట్లు (0.42 శాతం) కోత పెట్టారు. ధరల స్థిరీకరణ నిధి రూ.3 వేల కోట్లు అంటూనే 500 కోట్లే పెట్టారు. సున్నా వడ్డీకి అవసరం మేరకు ప్రతిపాదించలేదు.

# 'రాజధానిపై హైకోర్టు తీర్పు రైతుల పోరాట విజయం'

రాష్ట్రానికి రాజధాని అమరావతేనని, రైతుల భూములను రాజధానికిగాక ఇతరత్రా ఉపయోగించరాదని హైకోర్టు తీర్పునివ్వడం రైతుల పోరాట విజయమేనని ఎపి రైతు సంఘం అభిప్రాయపడింది. అన్ని వసతులతో రాజధాని నగరాన్ని ఆరు నెలల్లోగా అభివృద్ధి చేయాలని, రైతుల భూములను రాజధానికి మినహా మరే ఇతరానికి ఉపయోగిచరాదని ప్రభుత్వాన్ని హైకోర్టు ఆదేశించింది. ఈ తీర్పును ప్రధాన న్యాయమూర్తి పికె మిశ్రా, న్యాయమూర్తులు ఎం.సత్య నారాయణమూర్తి, డివిఎస్ సోమయాజులు వెలువరించారు. అమరావతిలోనే రాజధాని ఉండాలని, సమీకరణలో భూములిచ్చిన రైతులకు వారికి ఇస్తానన్న విధంగా ప్రయోజనాలు కల్పించాలని ఎపి రైతు సంఘం మొదటి నుంచీ కోరుతోంది. రాజధాని జెఎసి పోరాటాలకు అనేక విధాల మద్దతు పలికింది. కొన్ని సార్లు పోరాటాల్లోనూ పాల్గొన్నది. రైతుల భూములను భూ సేకరణ చట్టం ద్వారా చేసి ఉంటే వారికి మరింత ప్రయోజనం చేకూరి ఉండేది. అయితే ప్రభుత్వం సమీకరణ ద్వారా భూములను తీసుకున్నది. ఏమైనా ప్రభుత్వానికి రాజధాని నిమిత్తం రైతులు తమ భూములను ఇచ్చారు. ఈ నేపథ్యంలో రాష్ట్ర ప్రభుత్వం మూడు రాజధానుల ప్రతిపాదన తెచ్చింది. దీనిపై అమరావతి రైతులు, వివిధ ప్రజా సంఘాలవారు జెఎసిగా ఏర్పడి 807 రోజులపాటు నిరాహారదీక్షలతోపాటు పలు పద్ధతుల్లో ఉద్యమాలు చేశారు. ఇందులో మహిళా రైతులు ఎంతో తెగింపుతో పోరాడారు. రాజధాని పూలింగ్‌లో భాగంగా రైతులు ప్రభుత్వానికి ఇచ్చిన భూములను రాజధాని అవసరాలకు మినహా



ఇతరత్రా ఉపయోగించడానికి వీల్లేదని హైకోర్టు తీర్పు చెప్పింది. వ్యవసాయ కార్మిక సంఘ పూర్వపు రాష్ట్ర ప్రధాన కార్యదర్శి పి.మధు, పట్టణ పౌర సదుపాయాల కల్పన పోరాట సంఘ నాయకులు సిహెచ్ బాబూరావు, ఇంకా పాశం రామారావు హైకోర్టు తీర్పు నేపథ్యంలో వెలగపూడిలో ఉన్న రైతుల శిబిరానికి వెళ్లి రైతులకు అభినందనలు తెలిపారు. రాజధానికి రైతులిచ్చిన భూములను తనఖా పెట్టడం, రుణాలు తేవడం వంటివి చేయరాదని హైకోర్టు తీర్పు ఇచ్చింది. రైతులకు తిరిగి ఇవ్వాల్సిన ప్లాట్లలో రోడ్లు, తాగునీటి సదుపాయం, విద్యుత్తు కనెక్షన్లు, ప్రతి ప్లాటుకూ ఉండేలా డ్రైనేజీ వ్యవస్థనూ సిఆర్‌డిఏ నిర్దేశించిన విధంగా ఏర్పాటు చేయాలని హైకోర్టు ఆదేశించింది. రాష్ట్ర ప్రభుత్వం హామీ ఇచ్చిన విధంగా మూడు నెలల్లో ప్లాట్ల పంపిణీ పూర్తి కావాలని తెలిపింది. అభివృద్ధి పనులపై ఎప్పటికప్పుడే నివేదికను సమర్పించాలని ఆదేశించింది. వీటితోపాటు పిటీషన్లు దాఖలు చేసిన 64 మంది రైతులకు ఒక్కొక్కరికి రూ.50 వేల చొప్పున పరిహారం చెల్లించాలని తీర్పు చెప్పింది. ✷

# రాష్ట్ర బడ్జెట్లో కౌలు రైతులకు 'భరోసా' ఏది?





**పి. జమలయ్య**
రాష్ట్ర ప్రధాన కార్యదర్శి,
ఆంధ్రప్రదేశ్ కౌలురైతుల సంఘం.

రాష్ట్ర బడ్జెట్లో కౌలు రైతులకు మొండిచేయి చూపించారు. సాగు భూముల్లో 70 శాతం కౌలు రైతులే పంటలు పండిస్తున్నారు. రాష్ట్ర ప్రభుత్వం వైపు నుండి కౌలు రైతులకు ఎటువంటి సహాయ సహకారాలు కల్పించకపోయినా.. ప్రైవేటు వడ్డీ వ్యాపారుల దగ్గర నూటికి ఐదు రూపాయలకు వడ్డీకి తెచ్చి సేద్యం చేస్తున్నారు. వ్యవసాయ భూముల కౌలు రేట్లు, ఇన్‌పుట్స్ ధరలు రోజురోజుకూ పెరగడంతో సాగు భారంగా మారింది. ప్రకృతి విపత్తుల వలన పంటలు దెబ్బతిన్నాయి. వేల కోట్ల రూపాయలు పెట్టుబడిని నష్టపోయారు. దిగుబడులు తగ్గాయి. దీనికి తోడు మద్దతు ధర అందకపోవడంతో కౌలు రైతులు పీకల్లోతు అప్పుల్లోకి కూరుకుపోయారు. అప్పులు తీర్చే మార్గంలేక ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. సాగు చేస్తే చావును దగ్గరకు తెచ్చుకున్నట్టే ఉంది పరిస్థితి. ఇది ప్రమాదకరమైన సంకేతం. దీన్నిబట్టి చూస్తే వ్యవసాయ రంగం ఎంత తీవ్రమైన సంక్షోభంలో కూరుకుపోయిందో అర్థమవుతుంది. రాష్ట్రంలో ప్రతిరోజూ ఏదో ఒకచోట రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్న ఘటనలు వెలుగుచూస్తున్నాయి. ఈ వ్యవసాయ సంక్షోభం నుండి రైతులను రక్షించడానికి రాష్ట్ర బడ్జెట్‌లో ఎటువంటి ప్రతిపాదనలు లేవు. ఎలాంటి రక్షణ చర్యలూ లేవు. పైగా రైతాంగం నుండి నీటి తీరువాను రూ.650 కోట్లు వసూళ్లు చేస్తోంది. వ్యవసాయ విద్యుత్తు మోటర్లకు ప్రీపెయిడ్ మీటర్లు బిగించి భవిష్యత్తులో విద్యుత్ చార్జీల భారాన్ని మోపటానికి రంగం సిద్ధం చేస్తోంది. ఇప్పటికే వ్యవసాయ అనుబంధ రంగమైన మత్స్యకారుల చేపల చెరువులను బహిరంగ వేలం వేసి మత్స్యకారుల ఆదాయానికి గండి కొట్టి ఖజానాన్ని నింపుకోవడానికి జీవో నెం. 217ను తెచ్చింది. భారాలు మోపుతోంది. సహకార రంగాన్ని కాపాడతాని వాగ్దానం చేసి ఇప్పుడు ఆ రంగంలో ఉన్న షుగరు ఫ్యాక్టరీలను వేలం వేస్తోంది. కోట్లాది రూపాయల విలువ చేసే భూములను రియల్టర్లుకు అమ్ముతోంది.

మొత్తం రాష్ట్ర బడ్జెట్లో రూ.2.56 లక్షల కోట్లు ప్రతిపాదిస్తూ కొటేషన్‌లు చెప్పి వ్యవసాయ రంగానికి కేటాయింపులు తగ్గించారు. రాష్ట్రంలో ఐదు లక్షలా 13 వేల ఎకరాల్లో మిర్చి పంట రకరకాల వైరస్‌ల వల్ల దెబ్బతింటే రైతులను ఆదుకునేందుకు ఒక్క రూపాయి కూడా బడ్జెట్లో కేటాయింపులు చేయకపోవడం దారుణం. ఈ బడ్జెట్‌లో వ్యవసాయ, వాటి అనుబంధ రంగాలకు రూ.43 వేల కోట్లు ప్రతిపాదిస్తున్నట్లు వ్యవసాయ శాఖ మంత్రి కురసాల కన్నబాబు శాసనమండలిలో వ్యవసాయ బడ్జెట్‌ను ప్రవేశ పెడుతూ చెప్పారు. వ్యవసాయ రంగానికి పెద్దపీట వేస్తున్నట్లు గొప్పలు చెప్పారు. దేశంలో ఎక్కడాలేని విధంగా కౌలు రైతులను ఆదుకుంటున్నామని చెప్పుకొచ్చారు. వీటిని పరిశీలిస్తేగాని రాష్ట్ర ప్రభుత్వ డొల్లతనం కనిపించదు. పెట్టుబడి సాయం నిమిత్తం రాష్ట్ర బడ్జెట్‌లో రూ.3,900 కోట్లు కేటాయించారు. గత బడ్జెట్‌లో రూ.3,850 కోట్లును 51.59 లక్షల సొంత భూమి కలిగిన రైతాంగానికి అందించామని, ఇందులో కౌలురైతులకు మాత్రం 1.54 లక్షల మందికి ఇచ్చామని చెబుతున్నారు. వాస్తవంగా పరిశీలిస్తే అటవీ హక్కుల చట్టం ద్వారా సర్టిఫికెట్లు పొందిన గిరిజన రైతులకు ఇచ్చిన రైతు భరోసాను కూడా కౌలురైతుల సంఖ్యలో

కలపి లెక్కలు చెప్పటం సిగ్గు చేటు. రాష్ట్రంలో భూమిలేని దళితులు, గిరిజనులు, మైనారిటీలు, వెనుకబడిన తరగతులకు చెందిన కౌలు రైతాంగం 6 లక్షల పైమాటే ఉంది. వాస్తవానికి కౌలు రైతులకు నిరుడు 67 వేల మందికే ఇచ్చింది. అదీ రూ.90 కోట్లు మాత్రమే.

పంట రుణాలు పరిశీలిస్తే ఇంతకన్నా దారుణమైన పరిస్థితి వుంది. సున్నా వడ్డీ పథకం కింద వచ్చే ఏడాదికి రూ.500 కోట్లే ప్రతిపాదించారు. నిరుడూ రు.500 కోట్లు కేటాయించారు. నిజం చెప్పాలంటే రూ.2 వేల కోట్ల మేర కేటాయింపులు జరగాలి. నిరుడు ఖరీఫ్, రబీ సీజన్లకు కలపి పంట రుణాల కింద రూ.75వేల కోట్లు అందించారు. ఈ పథకంలో లక్ష రూపాయల లోపు పంట రుణం తీసుకొని సకాలంలో చెల్లిస్తే వడ్డీ మాఫీ అవుతుంది. కానీ కౌలు రైతులకు ఎంత మందికి ఇచ్చారో లెక్కలలోకి వెళ్తే చేదు నిజాలు బయట పడతాయి.

రాష్ట్ర ప్రభుత్వం నిరుడు సుమారు 4 లక్షలా 14 వేల మందికి కౌలు గుర్తింపు కార్డులు ఇచ్చింది. ఇందులో 58 వేల మంది కౌలు రైతులకు రూ.571 కోట్లు అందజేసినట్లు చెబుతున్నారు. గ్రూపులలోని 43 వేల మందికి, రైతు మిత్ర గ్రూపుల్లోని 27 వేల మందికి కూడా కలిపి మొత్తం ఒక లక్షా 29 వేల మందికి రూ.922 కోట్లు పంట రుణాలు అందజేశామని వ్యవసాయ శాఖ మంత్రివర్యులు చెప్పటం ఆశ్చర్యం. వాస్తవంగా పైవాటిని పరిశీలించినప్పుడు సిసిఆర్‌సి కార్డు ద్వారా రుణాలు పొందిన వారే. సెంటు భూమి కూడా సాగు చేయకుండానే వేల కోట్ల రూపాయలు పంట రుణాలు భూస్వాములు కాజేస్తున్నారని రాష్ట్ర స్థాయి బ్యాంకర్ల కమిటీ చైర్మన్ బ్రహ్మానంద రెడ్డి ప్రకటించారంటే రుణాల పేరుతో ఏ విధంగా దోపిడీ జరుగుతోందో, కౌలు రైతులకు ఎంత అన్యాయం జరుగుతోందో ఆయన మాటల ద్వారానే తెలుస్తోంది. రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా (ఆర్‌బిఐ) నిబంధనలు... భూమిలేని సాగుదారులకు లక్షా 60 వేల రూపాయల వరకు ఏమీలేని రుణాలివచ్చని చెబుతున్నాయి. అలాంటప్పుడు బ్యాంక్ నిబంధనలు ఎందుకు అమలు పరచడం లేదు. ఇది 2జి స్కామ్‌కు మించిందని వ్యవసాయ శాఖ మాజీ ముఖ్య కార్యదర్శి అన్నారంటే దీని తీవ్రత అర్థం చేసుకోవచ్చు.

రాష్ట్ర ప్రభుత్వం ఈ బడ్జెట్‌లో ప్రకృతి విపత్తుల పద్దు కింద రూ.2 వేల కోట్లు, పంటల బీమా పథకం కింద మరో రూ.1800 కోట్లు ప్రతిపాదించింది. నిరుడు ఇంచుమించు ఇదే తరహాలో కేటాయింపులు జరిగాయి. నవంబరు ఖరీఫ్‌లో రాష్ట్రం మొత్తంగా రూ.13.50 లక్షల ఎకరాల్లో పంటల దెబ్బ తినటం వలన రూ.3500 కోట్లు నష్టం జరిగింది. నాలుగు లక్షల ఎకరాలకు 6 లక్షల మందికి రూ.542 కోట్లు ఇచ్చారు. ఇచ్చిన మేరకు వాస్తవంగా నష్టపోయిన కౌలు రైతులకు ఇవ్వలేదు. ఇందులో కూడా పచ్చి మోసం జరిగింది. మొత్తం ఇన్‌పుట్ సబ్సిడీలో ఒక్క శాతం కూడా కౌలు రైతులకు అందలేదు. పంటల బీమాలో అయితే కౌలు రైతులు చేరే అవకాశం లేకుండా చేశారు. రైతు భరోసా కేంద్రంలో పండించిన పంటలను అమ్ముకోవాలంటే ఇ-క్రాప్ బుకింగ్ జరిగితేనే బీమా పథకం వర్తిస్తుంది. అంతేగాకుండా పంటలు అమ్ముకోవడానికి కూడా అవకాశం వుంటుంది. నడుస్తున్న సంవత్సరంలో రాష్ట్రంలో 37 లక్షల మెట్రిక్ టన్నుల ధాన్యాన్ని మద్దతు ధరలకు కొనుగోలు చేసి రైతాంగాన్ని ఆదుకున్నామని చెప్పటం హాస్యాస్పదంగా ఉంది. రాష్ట్ర ప్రభుత్వం 80 శాతం ధాన్యాన్ని షావుకారుల నుంచే సేకరించిందని ఏ కౌలు రైతును అడిగినా చెబుతారు. రాష్ట్ర ప్రభుత్వం ప్రవేశపెట్టిన ఏ పథకాన్ని పొందాలన్నా కౌలు గుర్తింపు కార్డులు ఉండాలి. అప్పుడు మాత్రమే రైతు భరోసా కేంద్రంలో పంటల అమ్ముకునేది. కార్డులే జారీ కానప్పుడు మద్దతు ధరలకు అమ్ముకొనే అవకాశమే లేదు. ఈ అవకాశం లేక తమ పంటలను తక్కువ ధరకు షావుకారులకు, మిల్లర్లకు ఏజెంట్లకు అమ్ముకొని ఎకరానికి రూ.10 వేలు నష్ట పోయారు. సబ్సిడీ విత్తనాలు, ఎరువులు, పురుగు మందులు, వ్యవసాయ పరికరాలు తీసుకోవాలంటే కౌలు గుర్తింపు కార్డులు అనివార్యం. అన్ని పథకాలకు ఈ -క్రాఫ్ బుకింగ్ అవసరం. ఇది జరగాలంటే కౌలు గుర్తింపు కార్డులు పొందాలి.

వైసిపి అధికారంలోకి వచ్చిన తొలినాళ్ళలో రాష్ట్ర ప్రభుత్వం గతంలో ఉన్న 2011 ఆంధ్రప్రదేశ్ భూమి అధీకృత సాగుదారుల లైసెన్స్‌డ్ చట్టాన్ని ఆంధ్రా ప్రాంతం కౌలుదారుల చట్టాన్ని రద్దు చేసి "ఆంధ్రప్రదేశ్ పంట సాగుదారుల హక్కుల చట్టం"ను ఏకపక్షంగా తెచ్చింది. ఈ చట్టమే కౌలు రైతులకు ఉరితాడుగా మారింది. ఈ చట్ట ప్రకారం కౌలు గుర్తింపు కార్డులు పొందాలంటే భూ యాజమాని కౌలు ఒప్పందం పత్రం లిఖితపూర్వకంగా రాసి కౌలు రైతులకు ఇవ్వాలి. ఆ పత్రాన్ని గ్రామ సచివాలయంలో గ్రామ రెవెన్యూ అధికారి గారికి ఇస్తే దాన్ని పరిశీలించి కౌలు గుర్తింపు కార్డులు ఇస్తారు. కానీ ఇలా ఎక్కడా జరగడం లేదు. ఈ రోజు కౌలు రైతులు నష్ట పోవడానికి కారణం రాష్ట్ర ప్రభుత్వమే. కౌలు రైతులకు న్యాయం జరగాలంటే ముందుగా రాష్ట్ర ప్రభుత్వం తెచ్చిన నూతన కౌలు రైతుల చట్టాన్ని సవరించాలి. భూ యజమాని ప్రమేయం లేకుండానే గ్రామ సభలు జరిపి కౌలు రైతులను గుర్తించి అక్కడే గుర్తింపు కార్డులు జారీ చేయాలి. అంతే గాకుండా డబుల్ ఫైనాన్స్‌తో సంబంధం లేకుండా 'స్కేల్ ఆఫ్ ఫైనాన్స్' ప్రకారం పంట రుణాలు అందించాలి. రైతు భరోసా నిబంధనలు సడలించి భూమిలేని కౌలు రైతులందరికీ పెట్టుబడి సాయం నగదు బదిలీ 25 వేలు అందించాలి. ఒక రకంగా చెప్పాలంటే కౌలు రైతులకు ప్రత్యేక బడ్జెట్ రూపొందించాల్సిన అవసరం కనిపిస్తోంది. ఇప్పటికైనా బడ్జెట్‌లో ప్రత్యేకంగా నిధులు కేటాయింపులు చేసి కౌలు రైతుల సంక్షేమానికి దోహదపడాలి.

**(వ్యాసకర్త : ఏపి కౌలు రైతు సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి)**

## మోడీ రైతు వ్యతిరేక పాలనపై పోరాటాలు అవశ్యం

# రైతు గర్జన సభలో నేతల శంఖారావం




(మన రైతువాణి బ్యూరో)

నరేంద్ర మోడీ దేశ వ్యతిరేక పాలన సాగిస్తున్నారని, అతణ్ణి అధికారం నుంచి దించకుంటే రైతాంగానికి ముప్పు వాటిల్లుతుందని రైతు నేతలు హెచ్చరించారు. మార్చి 23న విజయవాడ దాసరి భవన్‌లో జరిగిన 'రైతు గర్జన సభ'లో పాల్గొన్న అఖిలభారత, రాష్ట్ర నాయకులు సంయుక్తంగా ఈ పిలుపునిచ్చారు.

సభలో తొలుత అతుల్ కుమార్ అంజన్ మాట్లాడుతూ.. మోడీ పాలనలో గత ఆరేడేళ్ల నుంచి గ్రామీణ భారతం అణగారిపోయిందని, ఐఎంఎఫ్, డబ్ల్యుటిఓ, కార్పొరేట్ శక్తులకు ఊడిగం చేస్తూ మోడీ పాలన కొనసాగిస్తున్నారని విమర్శించారు. కార్పొరేట్ శక్తులకు ప్రభుత్వ సంస్థలను ధారాదత్తం చేస్తున్నారని మండిపడ్డారు. మోడీ ప్రభుత్వం ఆడలేక మద్దెల ఓడు అన్న చందంగా ఆర్థిక నష్టాలకు కరోనాను కారణంగా చూపిచూస్తోందని, ఇది రెండేళ్ల నుంచి మాత్రమే ఉందని, 2016 నుంచీ ఈ నష్టాలు ఇలా ఎందుకు ఉన్నాయని ప్రశ్నించారు. రైతాంగ పరిస్థితి దిగజారిపోయిందని, ఐదు రాష్ట్రాల ఎన్నికల తరువాత మళ్లీ డీజిల్ రేట్లు పెరిగాయని, దానికి ఉక్రెయిన్ యుద్ధం సాకు చూపుతున్నారని అన్నారు. దేశ పరిస్థితులను అధ్యయనం చేయాల్సి ఉందని, ఎల్ఐసి 10 శాతం వాటా మాత్రమే అమ్ముతామని చెప్పినప్పటికీ 20 శాతం అమ్మబోతున్నారని వెల్లడించారు. ఇతర ప్రభుత్వ సంస్థలనూ అమ్మేస్తున్నారని, మరి జీఎస్‌టీ తాలూకూ లాభాలు ప్రజలకు అందలేదే అని విమర్శించారు. వీటిపై రైతులు, కార్మికులు ఐక్య ఉద్యమాలు చేయాల్సి ఉంటుందని అన్నారు. "రైతు ఉద్యమం ఏడాది నడిచింది. దాన్ని నీరుగార్చడానికి చేసిన ప్రయత్నం విఫలమైంది. పోరాటానికి తలొగ్గి మూడు నల్ల వ్యవసాయ బిల్లులను ఉపసంహరించుకున్నా.. ఆ ప్రమాదం పూర్తిగా తొలిగిపోలేదు' అన్నారు. రైతు ఉద్యమం నేపథ్యంలో వ్యవసాయ బిల్లులపై సుప్రీంకోర్టు ఒక అధ్యయన కమిటీ వేసిందని, అందులో మోడీ తాబేదార్లే వున్నారని, వారంతా అవాస్తవాల ఆధారంగా సుప్రీంకోర్టుకు నివేదిక సమర్పించారని అన్నారు. ఈ కమిటీ ఆన్‌లైన్‌లో మాత్రమే అభిప్రాయాలు అడిగిందని, బిల్లులకు అనుకూలంగా ఐదు శాతానికి మించి చెప్పలేదని, వ్యతిరేకంగా ఉన్న మిగిలిన 95 శాతం మంది రైతుల అభిప్రాయాలను పరిగణనలోకి తీసుకోలేదని వివరించారు. సుప్రీంకోర్టుకు సమర్పించిన నివేదికను బట్టబయలు చేయాలని డిమాండ్ చేశారు. బీజేపీ ఐంత్రోతులు మూడు నెలల్లో వ్యవసాయ బిల్లులు మళ్లీ తెస్తామని పేలుతున్నారని తెలిపారు. బిల్లులు పెట్టేది లేదని ప్రధాని లిఖితపూర్వకంగా రాసిస్తేనే విశ్వసిస్తామని, మళ్లీ బిల్లులు ప్రవేశపెడితే తిప్పికొడతామని అన్నారు. రైతుల సాగు నష్టాలను దృష్టిలో పెట్టుకొని స్వామినాథన్ కమిటీ రెట్టింపు మద్దతు ధర ఇవ్వాలని సూచించిందని, ఈ కమిటీలో తాను కూడా సభ్యుణ్ణని తెలిపారు. రైతు ఉద్యమ కాలంలో 750 మంది రైతులు చనిపోయారని, వారి త్యాగాల స్ఫూర్తిగా మోడీ ప్రభుత్వాన్ని తలొంచే విధంగా ఉద్యమాన్ని ముందుకు తీసుకువెళ్లాలని సూచించారు.

### ఒక్క రోజు రైతు ఆదాయం రూ.27 మాత్రమే : విజ్జూ కృష్ణన్

అఖిల భారత కిసాన్ సభ సహాయ కార్యదర్శి విజ్జూ కృష్ణన్ మాట్లాడుతూ.. రైతు, కార్మికుల ఐక్యత చూసిన జగన్ ప్రభుత్వానికి భయం పట్టుకుందని ఎద్దేవా చేశారు. అందుకే రైతు గర్జనకు అనుమతి నిరాకరించిందని చెప్పారు. 500కు పైగా రైతు సంఘాలు ఏకమై రెండేళ్లపాటు ఐక్యంగా చారిత్రాత్మక రైతు పోరాటం నిర్వహించాయని, ఇది భారత్‌కు మాత్రమే పరిమితమైన ఉద్యమం కాదని, ప్రపంచ మంతటా ఫాసిస్టు శక్తులను ఓడించే పోరాటం అవుతుందని నోమ్ చోమ్‌స్కీ చెప్పిన విషయాన్ని గుర్తు చేశారు. మోడీ ఏడేళ్ల నుంచి రైతు వ్యతిరేక విధానాలను అనుసరిస్తున్నారని, రైతులు తమ వ్యవసాయ ఉత్పత్తులు కారు చౌకగా అమ్ముకోవాల్సి వస్తోందని, టమోటా వంటి పంట కిలో ఒక రూపాయికి అమ్ముకునే దుస్థితి దాపురించిందని, అలా రైతుల వద్ద కొనుగోలు చేసి మార్కెట్లో రూ.40, రూ.50లకు విక్రయిస్తున్నారని, అదే రిలయన్స్ ఫ్రెష్‌ల్లో అయితే రూ.80 వరకూ అమ్ముతున్నారని విచారం వ్యక్తం చేశారు. దీన్నిబట్టి రైతు ఎంత

సంక్షోభంలో ఉన్నాడో విదితమౌతోందని అన్నారు. ఇటీవల వర్షాలు, వరదలకు అనంతపురం జిల్లాలో పంట నష్టం అపారంగా జరిగిందని, ఎక్కువగా రైతు ఆత్మహత్యలు జరిగే ఈ జిల్లాలో పరిస్థితి మరెంత తీవ్రంగా ఉంటుందో ఊహించొచ్చని అన్నారు. రాష్ట్రంలో ఐదు లక్షల ఎకరాల్లో మిర్చి పైరు నాశనం అయ్యిందని, ఇంత జరిగినా కేంద్రంలో మోడీగాని, రాష్ట్రంలో జగన్‌గాని ఏమాత్రం స్పందించలేదన్నారు. రైతుకు భరోసాయే లేదన్నారు. ప్రధానమంత్రి ఫసల్ బీమా యోజన కార్పొరేట్లకేగాని రైతులకు ఏమాత్రం వుపయోగపడటం లేదన్నారు. రైతుల ఆదాయాన్ని రెట్టింపు చేస్తామని చెప్పారని, మరి ఇప్పుడు రైతు ఆదాయం ఎంతో చెప్పగలరా? అని ప్రశ్నించారు. రైతు ఒక రోజు ఆదాయం కేవలం రూ.27 మాత్రమే ఉందని, ఇది తమ కిసాన్ సభ చెప్పడం లేదని, మోడీయే చెపుతున్నారని అన్నారు. వరికి కేంద్రం నిర్ణయించిన మద్దతు ధర కూడా లభించడం లేదని అన్నారు. కేరళలో ఆ రాష్ట్ర వామపక్ష ప్రభుత్వం మద్దతు ధరపై అదనంగా వెయ్యి రూపాయలు బోనస్ ఇచ్చి రైతులను ఆదుకుంటోందని అన్నారు. ఇదే విధానం ఇక్కడా అమలు జరగాలని కోరారు. ఇక్కడ జగన్ ప్రభుత్వం రైతుకు ఏడాదికి రూ.13 వేలు ఇస్తున్నానని చెపుతోందని, అదే కేరళలో పంచాయతీలు రూ.17 వేలు రైతులకు సబ్సిడీ ఇస్తున్నాయని వివరించారు. అక్కడ రైతులకు, వ్యవసాయ కార్మికులకు ప్రత్యేక పింఛన్లు ఇస్తుంటే, ఇక్కడ 32 లక్షల మంది కౌలు రైతులకు మొండి చేయి చూపిస్తున్నారని అన్నారు. అందుకే రైతు, కార్మిక ఐక్యత తప్పనిసరి అని, రైతు పోరాటానికి కార్మికులు విశేష సంఘీభావం తెలిపారని, ఆ రీతిగానే 28, 29 తేదీల్లో జరిగే కార్మికుల సమ్మెకు రైతాంగం మద్దతు తెలిపాలని కోరారు.

అఖిల భారత కిసాన్ మజ్దూర్ సభ ప్రధాన కార్యదర్శి అశోక్ గాయల్ మాట్లాడుతూ.. దేశంలో ఉద్యమాలు కుల, మత, వర్గ ప్రాతిపదికగా విడివిడిగా జరుగుతున్నాయని, అన్ని వర్గాలూ ఏకతాటిపైకి వచ్చి తిరుగుబాటు చేస్తేనే కేంద్ర ప్రభుత్వం కుప్పకూలుతుందని, అప్పుడే రైతు మనుగడ సాధ్యమని అన్నారు.

అఖిల భారత కిసాన్ సంఘటన కన్వీనర్ బసవలింగప్ప మాట్లాడుతూ.. చరిత్రపుటల్లోకి వెళ్తే తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటం, శ్రీకాకుళ రైతాంగ పోరాటం కనిపిస్తాయని,రెండేళ్లుగా జరిగిన రైతు ఉద్యమం కూడా చరిత్రకెక్కిందని, అదే జరిగి వుండక పోతే దేశంలో ఈ కాలంలో ఎన్నో అన్యాయాలను చూసి వుండేవాళ్లమని అన్నారు.

ఎఐకెఎంఎస్ నాయకులు సింహాద్రి ఝాన్సీ మాట్లాడుతూ.. రైతు సమస్యలు మన చుట్టూ వున్న వారికి తెలియజేయడానికే రైతు గర్జన పెట్టామని, దీనికే ఈ ప్రభుత్వానికి భయమెందుకు పట్టుకుందని ప్రశ్నించారు. గర్జన ఆపినంత మాత్రాన వారి ప్రయత్నం సఫలం కాదని, జిల్లా, మండల, గ్రామ స్థాయిలో రైతులను, రైతు కూలీలను ఏకం చేసి చైతన్యం కలిగిస్తే జగన్ ప్రభుత్వం ఏమీ చేయలేదని అన్నారు.

ఎఐకెఎంఎస్ నాయకులు ప్రభాకరరెడ్డి మాట్లాడుతూ.. రాయలసీమలో పంటలన్నీ నాశనమయ్యాయని, అక్కడి రైతులు ఉద్యమం ద్వారా తమ సమస్యలను పరిష్కరించుకునేందుకు సిద్ధపడుతున్నారని అన్నారు. రాయలసీమ రైతులను ముట్టుకుంటే తీవ్రమైన షాక్ కొడుతుందని గుర్తించాలని జగన్‌కు సూచించారు.

రైతు నాయకులు ఏర్నేని నాగేంద్రనాద్ మాట్లాడుతూ.. మోడీ ప్రభుత్వం అంబానీ, ఆదానీ కోసం కృషి చేస్తోందని, హిందూ - ముస్లింల మధ్య కలహాలను ఎగదోస్తోందని, ఇలాంటి చోట్ల మీటింగును కూడా పెట్టుకోనివ్వడం లేదని, మోడీని ఎదుర్కోకపోతే దేశ సర్వనాశనంగాక తప్పదని అన్నారు.

రైతు నాయకులు భాను మాట్లాడుతూ.. తాను 13 జిల్లాలోనూ వ్యవసాయ రంగ సమస్యలను అధ్యయనం చేశానని, ఎక్కడా రైతును ప్రభుత్వాలు ఆదుకోవడం లేదని అన్నారు. రాష్ట్రంలో రైతు ఆత్మహత్యలు పెరుగుతున్నాయని, ఆ విధంగా గత రెండున్నరేళ్లలో ఒక్క పశ్చిమగోదావరిలోనే 42 మంది ఆత్మహత్యలు చేసుకున్నారని చెప్పారు. రైతు భరోసాగానీ, సచివాలయాలుగానీ, వాలంటీర్లుగాని రైతును కాపాడలేకపోతున్నారని అన్నారు.

రైతు సంఘ నాయకులు చుండూరు రంగారావు మాట్లాడుతూ.. తమ అధికారానికి తిప్పలు వచ్చినప్పుడే పాలకులు రైతాంగ సమస్యల గురించి మాట్లాడుతూ ఉంటారని, దాన్ని గమనించి ఉద్యమాల్లోకి రైతులు పెద్ద ఎత్తున కదిలి రావాలని కోరారు. ఏపీలో 92 శాతం మంది రైతులు అప్పులు ఊబిలో కూరుకుపోయారని చెప్పారు.

అఖిల భారత రైతు సంఘం నాయకులు రావుల వెంకయ్య మాట్లాడుతూ.. ఉద్యమాలను కాలరాయాలని తలచిన నియంతలు కాలగర్భంలో కలిసిపోయారని, ఇందిర ఎమెర్జెన్సీ పెట్టి దారుణంగా ఓడిపోయిందని, మోడీ రైతు ఉద్యమానికి తలొగ్గి క్షమాపణ చెప్పాల్సి వచ్చిందని అన్నారు. జగన్ కూడా ఆ జాబితాలో చేరి చేతులు కాల్చుకోబోతున్నారా అని ప్రశ్నించారు.

రైతు నాయకులు వెంకటరెడ్డి మాట్లాడుతూ.. చెరుకు బకాయిలు చెల్లించకపోతే అన్నదాతలు ఎలా బతకాలని ప్రభుత్వాన్ని ప్రశ్నించారు. అసెంబ్లీలో రైతుల సమస్యలు వినేవాలేరని, అది చేపల మార్కెట్‌ను తలపిస్తోందని విమర్శించారు.

చివరిగా ఎపి రైతు సంఘం రాష్ట్ర అధ్యక్షులు వై.కేశవరావు మాట్లాడుతూ.. భవిష్యత్తులో రైతులు నిర్వర్తించాల్సిన కర్తవ్యాలను ప్రవేశపెట్టారు. చారిత్రాత్మక రైతు ఉద్యమానికి కార్మికవర్గం అండదండ లిచ్చినందున.. 28, 29 తేదీల్లో జరిగే సమ్మెకు రైతాంగం సంఘీభావం తెలిపి పాల్గొనాలని, కనీస మద్దతు ధరల సాధనకు ఉద్యమాలు నిర్వహించాలని, ఏప్రిల్ ఒకటో తేదీ నుంచి రైతులు ఎదుర్కొనే ఏ సమస్య ముందుకొస్తే ఆ సమస్యపై పనిచేయాలని, ఉద్యమాలు నిర్వహించాలని కోరారు. తొలుత ఎపి కౌలు రైతు సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి పి.జమలయ్య నేతలను వేదికపైకి ఆహ్వానించారు. సభకు మర్రాపు సూర్యనారాయణ, కెవివి ప్రసాద్, చిట్టిపాటి వెంకటేశ్వర్లు అధ్యక్షవర్గంగా వ్యవహరించారు. గాలిచంద్ర వందన సమర్పణ చేశారు.

### తీర్మానాలు

- రాయలసీమకు కేంద్ర ప్రభుత్వం ప్రత్యేక ప్యాకేజీ ఇవ్వాలి
- వైరస్ వల్ల నష్టపోయిన మిర్చి రైతులకు ఎకరానికి లక్ష రూపాయల నష్టపరిహారమివ్వాలి
- మైక్రో ఇరిగేషన్ పరికరాలకు సబ్సిడీ ఇవ్వాలి. చెరకు, ధాన్యం రైతులకు బకాయిలు తక్షణమే చెల్లించాలి
- సుబాబుల్, జామాయిల్ కర్ర ఎగ్రిమెంట్ ధరలకు కొనుగోలు చేయాలి.
- వ్యవసాయ పంపుసెట్లకు మీటర్లు బిగించే పనిని వుపసంహరించుకోవాలి
- కౌలు రైతులను గుర్తించి వారికే పరిహారం ఇవ్వాలి.

### గర్జనను భగ్నం చేసేందుకు గృహ నిర్బంధాలు, అరెస్టులు

విజయవాడ ధర్నాచౌక్‌లో జరగనున్న రైతు గర్జన సభను విఫలం చేసేందుకు వైసిపి ప్రభుత్వం తీవ్రంగా ప్రయత్నించింది. సభ జరుపుకునేందుకు తొలుత అనుమతించి తరువాత నిరాకరించింది. అసెంబ్లీ జరుగుతున్న సమయంలో వేలాదిగా పాల్గొనే గర్జన సభ తమ ప్రభుత్వంపై ప్రభావం చూపే అవకాశం ఉండటంతో సభకు అనుమతి నిరాకరించి రాష్ట్ర వ్యాప్తంగా ఆరెస్టులకు తెగబడింది. ప్రతి జిల్లాలోనూ రైతు సంఘాల అధ్యక్ష, కార్యదర్శులనే కాకుండా సాధారణ రైతు కార్యకర్తలను సైతం ఇళ్ల దగ్గర పోలీసులను కాపలా పెట్టి గృహ నిర్బంధం చేశారు. గర్జనకు బయలుదేరిన అనేక మంది రైతు నాయకులను, కార్యకర్తలను అరెస్టు చేసి పోలీసు స్టేషన్ల చుట్టూ తిప్పారు. రైలు ప్రయాణంలో ఉన్న రైతులను రైలు నుంచి దించేశారు. విజయవాడ స్టేషన్‌కు చేరుకున్న రైతులను నిర్బంధించారు. దీంతో అప్పటికప్పుడు నాయకత్వం చర్చించి దాసరి భవన్‌లోని మీటింగు హాలుకు గర్జన సభను మార్పు చేసింది. దాసరి భవనానికి వెళ్లే నాలుగు దారుల్లోనూ పోలీసు బలగాలను దింపారు. రోడ్డు మీద ఉన్న రైతులను మీకు ఇక్కడేం పని వెళ్లిపోండంటూ పోలీసులు బెదిరించారు. “రైతు సంఘాల నేతలు, కార్యక్రమానికి వచ్చిన రైతులు ఎవరైనా రోడ్డు మీద కనపడితే అరెస్టు చేసేయండి. ఫోర్సును పిలిపించండి. విజయవాడలో 144వ సెక్షన్ ఉంది. టీ తాగాలన్నా సభా వేదిక వద్దే తాగాలి. ఇష్టం వచ్చినట్లు రోడ్డు మీదకు వస్తే కుదరదు” అని పోలీసులు బెదిరింపులకు దిగారు. దాసరి భవన్ ఎదురుగా టీ కొట్టు వద్ద టీ తాగుతున్న రైతు నాయకులపై విజయవాడ సౌత్ జోన్ ఎసిపి వెంకటేశ్వర్లు, సిఐ సురేష్ అనుచిత వ్యాఖ్యలు చేశారు. అదేమని ప్రశ్నించిన వై.కేశవరావు, వి.కృష్ణయ్య, మర్రాపు సూర్యనారాయణ, పి.జమలయ్య, వెంకటరెడ్డిలను బెదిరించారు. ఎసిపి వెంకటేశ్వర్లు సిఐని పిలిచి ‘రోడ్డు మీద కనబడిన వారిని అరెస్టు చేయండి’ అని ఆర్డరు వేశారు. ‘సరే. ఆరెస్టు చేసుకోండి’ అని నాయకులు అడ్డం తిరిగారు. నాయకులు, పోలీసుల అధికారుల నడమ వాగ్వివాదం కొనసాగింది. తర్వాత పోలీసులు వెనక్కి తగ్గారు. ✱

**ఆహార ద్రవ్యోల్బణం కట్టడికి కేరళ ప్రత్యామ్నాయ నమూనా**

## కేరళ బడ్జెట్‌లో రూ.2వేల కోట్లు ప్రతిపాదన



ఆహార ద్రవ్యోల్బణం, ఆహార భద్రత అదుపునకు కేరళ ప్రభుత్వం 2వేల కోట్లు కేటాయించింది. కేరళ ఆర్థిక మంత్రి కె.ఎన్. బాలగోపాల్ 2022-23 ఆర్థిక సంవత్సరానికి రాష్ట్ర బడ్జెట్‌ను ఇటీవల అసెంబ్లీలో ప్రవేశపెడుతూ ఈ విషయం వెల్లడించారు. కేంద్ర ప్రభుత్వ విధానాలకు ప్రత్యామ్నాయంగా కేరళ మోడల్‌ను ముందుకు తెచ్చారు. కేరళ దీర్ఘకాలిక, సుస్థిర అభివృద్ధే లక్ష్యంగా లక్షా 34వేల కోట్లతో బడ్జెట్‌ను రూపొందించారు. ఆర్థిక మంత్రి పేపర్‌లెస్ బడ్జెట్‌ను ప్రవేశపెట్టడం కేరళ చరిత్రలో ఇదే ప్రథమం. ట్యాబ్ చూస్తూ మంత్రి బడ్జెట్ ప్రసంగం చేశారు. ప్రపంచ శాంతి పరిరక్షణ కోసం సదస్సులు, సమావేశాల నిర్వహణకు 2 కోట్లు కేటాయించారు. కేరళ మౌలిక సదుపాయాల అభివృద్ధికి, స్థానిక స్వపరిపాలన పటిష్టతకు బడ్జెట్‌లో పెద్ద పీట వేశారు. యూనివర్సిటీలకు 200 కోట్లు కేటాయించారు. షెడ్యూల్డ్ కులాల అభివృద్ధి, సంక్షేమ పథకాలకు కేటాయింపులు రూ.1314 కోట్లు పెరిగాయి. ఎస్‌సి విభాగంలో స్థానిక సంస్థల వాటాతో కలిపి రూ.3946 కోట్లు, ఎస్‌టి విభాగంలో రూ.937 కోట్లు కలిపి మొత్తం రూ.4883 కోట్లు కేటాయించారు..

### ఆచరణాత్మక బడ్జెట్ : విజయన్

బడ్జెట్‌ను ‘సంక్షోభాల్లో చిక్కుకోకుండా పరిమితులను ఎలా అధిగమించాలనే దానిపై ఆచరణాత్మక, అభివృద్ధి దృక్పథంతో కూడిన బడ్జెట్‌గా’ ముఖ్యమంత్రి పినరయి విజయన్ అభివర్ణించారు. ఉన్నత విద్య నాణ్యతను మెరుగుపరచడం, శాస్త్ర సాంకేతిక పరిశోధన రంగాన్ని విస్తరించడం, విజ్ఞాన రంగాన్ని ఉత్పత్తి రంగంతో అనుసంధానానికి బడ్జెట్‌లో అధిక ప్రాధాన్యత ఇచ్చామన్నారు. వ్యవసాయ రంగంలో సాంకేతికతను అమలు చేయడం ద్వారా ఉత్పాదకత, రైతు ఆదాయాన్ని పెంచడమే లక్ష్యంగా బడ్జెట్ ఉందన్నారు. అభివృద్ధి చెందిన దేశాల్లోని జీవన ప్రమాణాలకు అనుగుణంగా కేరళలో జీవన ప్రమాణాలు పెంచుతామన్నారు. ✱

# రెండ్రోజుల సార్వత్రిక సమ్మె విజయవంతం




విశాఖలో భారీ ర్యాలీ



విజయవాడలో పెద్దప్రదర్శన

కేంద్రంలోని బిజెపి ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాలకు నిరసనగా కార్మిక, ఉద్యోగ సంఘాలు చేపట్టిన రెండ్రోజుల సార్వత్రిక సమ్మె రాష్ట్రంలో విజయవంతమైంది. ఈ సమ్మెకు ఎపి రైతు సంఘం పూర్తి సంఘీభావం తెలియజేసింది. మార్చి 28, 29 రెండు రోజులూ కేంద్ర ప్రభుత్వ కార్యాలయాల వద్ద నిరసనలు, మానవహారాలు నిర్వహించారు. బిజెపి ప్రభుత్వ వ్యతిరేక నినాదాలతో రాష్ట్రంలోని నగరాలు, జిల్లా, మండల కేంద్రాలు హోరెత్తాయి. కార్మికులు, కర్షకులు, ఉద్యోగులు కదంతొక్కుతూ పలుచోట్ల భారీ ర్యాలీలు, రాస్తారోకోలు నిర్వహించారు. గ్రామాల్లో బంద్ వాతావరణం కనిపించింది. పలుచోట్ల తహశీల్దార్ కార్యాలయాల వద్ద ధర్నాలు నిర్వహించారు. బ్యాంకింగ్, బీమా, విద్యుత్, ఉక్కు, పోస్టల్, టెలికం, రవాణా తదితర రంగాలకు చెందిన కార్మికులు, ఉద్యోగులు సమ్మెలో భాగస్వాములయ్యారు. అధిక ధరలు అరికట్టాలని, ప్రభుత్వరంగ సంస్థలను కాపాడాలని, లేబర్ కోడ్‌లను రద్దు చేయాలని, విశాఖ స్టీల్‌ప్లాంట్‌ను కాపాడాలని, కనీస వేతనం కావాలని, మద్దతు ధరల చట్టం తీసుకురావాలని కార్మిక, కర్షకులు నినదించారు. విశాఖ స్టీల్‌ప్లాంట్ కాంట్రాక్టు కార్మికులు 100 శాతం, పర్మినెంట్ కార్మికులు 80 శాతం, హెచ్‌పిసిఎల్ కార్మికులు 75 శాతం మంది విధులను బహిష్కరించారు. బిహెచ్ఇఎల్, ఆటోనగర్, జివిఎంసి కార్మికులు సమ్మెలో పాల్గన్నారు. ఎల్ఐసి, బ్యాంకు ఉద్యోగులు సమ్మెలో వుండడంతో లావాదేవీలు నిలిచిపోయాయి. విశాఖ నగరంలోని రైల్వే డిఆర్ఎం కార్యాలయం నుంచి ఆర్‌టిసి కాంప్లెక్స్ వరకు వేలాది మందితో మహా ప్రదర్శన నిర్వహించారు. అనంతరం ఆశీల్ మెట్ట జంక్షన్ వద్ద జరిగిన సభలో సిఐటియు రాష్ట్ర అధ్యక్షుడు సిహెచ్.నర్సింగరావు మాట్లాడారు. విశాఖ ఏజెన్సీలోని 11 మండలాల్లో ర్యాలీలు నిర్వహించారు. నక్కపల్లిలో సిపిఎం, సిఐటియు ఆధ్వర్యాన ఆర్‌టిసి కాంప్లెక్స్ కూడలి వద్ద కార్మికులు బైటాయించారు. ఈ సందర్భంగా 15 మందిని పోలీసులు అరెస్టు చేశారు. కృష్ణాజిల్లాలో 51 మండల కేంద్రాల్లో మానవహారాలు నిర్వహించారు. గ్రామాల్లో సచివాలయాల వద్ద రైతు, కౌలురైతులు నిరసన తెలిపారు. విజయవాడ వన్‌టౌన్‌లోని హెడ్‌పోస్టాఫీసు వద్ద నిర్వహించిన మానవహారంలో సిఐటియు రాష్ట్ర ప్రధాన కార్యదర్శి ఎం.ఎ.గఫూర్ మాట్లాడారు. కర్నూలులో హెడ్‌పోస్టాఫీసు వద్ద నిరసన తెలిపారు. అనంతరం అక్కడి నుంచి కొండారెడ్డి బురుజు వరకూ ర్యాలీ నిర్వహించి మానవహారం చేపట్టారు. అనంతపురం జిల్లా రాయదుర్గం, అనంతపురంలలో ఆర్‌టిసి ఉద్యోగులు నిరసన తెలిపారు. అనంతపురంలో సిఐటియు, సిపిఎం ఆధ్వర్యంలో ర్యాలీ నిర్వహించారు. జిల్లా అంతటా నిరసన కార్యక్రమాలు జరిగాయి. తూర్పుగోదావరి జిల్లా కాకినాడలో ర్యాలీ, మానవహారాలు నిర్వహించారు. విజయనగరం జిల్లా పార్వతీపురంలో ప్రదర్శన, మానవహారం నిర్వహించారు. శ్రీకాకుళం నగరపాలక సంస్థ కార్యాలయం నుంచి డప్పులు మోగిస్తూ సూర్యమహల్ జంక్షన్ వరకు ప్రదర్శన నిర్వహించారు. పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు, తాడేపల్లిగూడెం, భీమవరం, నరసాపురం, జంగారెడ్డిగూడెంలలో ప్రదర్శన, మానవహారం నిర్వహించారు. ప్రకాశం జిల్లాలో బ్యాంకింగ్, ఎల్ఐసి, పోస్టల్ సేవలు స్తంభించిపోయాయి. గుంటూరు నగరంలో మానవహారం నిర్వహించారు. చిత్తూరు జిల్లా తిరుపతి బిఎస్ఎన్ఎల్, ఇండియన్ పోస్టల్ సర్వీసు కార్యాలయం ఎదుట నిరసన తెలిపారు. నెల్లూరు, కడప జిల్లాల్లో బైక్‌ర్యాలీలు, మానవహారాలు జరిగాయి.

# కమతం క్షీణత

• హోల్డింగ్స్‌లో పెరుగుదల • చిన్న, సన్నకారుపై తీవ్ర ఒత్తిడి • భూకేంద్రీకరణ దిశ





కె.ఎస్.వి. ప్రసాద్
94900 99019

రాష్ట్రంలో సగటు భూకమతం సైజు అంతకంతకూ తగ్గుతుండగా మొత్తం కమతాలు గణనీయంగా పెరుగుతున్నాయి. ఇదే సమయంలో భూ కేంద్రీకరణ సైతం పెరిగింది. చిన్న, సన్నకారు, సెమి మీడియం, మీడియం తరగతి రైతుల సగటు భూకమతం సైజు క్షీణించడమో లేదంటే అలానే ఉండటమో జరగ్గా భారీ భూకమతాల సైజు పెరిగింది. ఈ విషయాలు ప్రభుత్వం ఇటీవల అసెంబ్లీలో ప్రవేశపెట్టిన 2021-22- సామాజిక, ఆర్థిక సర్వేలో నిక్షిప్తమయ్యాయి. దేశ వ్యాప్తంగా భూ కమతాల (ల్యాండ్ హోల్డింగ్స్) వివరాల సేకరణ ప్రతి ఐదేళ్లకోసారి చేపడతారు. 2010-11 తర్వాత 2015-16లో గణాంకాలు సేకరించారు. మరోమారు 2020-21 వివరాలు సేకరించాలి. ఇప్పటికైతే 2015-16 గణాంకాలే అందుబాటులో వున్నాయి. ఆ ప్రకారం రాష్ట్ర సగటు భూకమతం 0.94 హెక్టార్లు. ఐదేళ్లకు ముందు 1.06 హెక్టార్లు. గతంలో రాష్ట్రవ్యాప్తంగా 80.97 లక్షల హెక్టార్లు రైతులు సాగుచేయగా ఐదేళ్లలో అది 80.04 లక్షల హెక్టార్లకు తగ్గింది. కమతాలు 76.21 లక్షల నుండి 85.34 లక్షలకు పెరిగాయి. ఐదేళ్లలో దాదాపు తొమ్మిదిన్నర లక్షల కమతాలు పెరిగాయి. భూమిపై ఆధారపడేవారి సంఖ్య ఎక్కువవుతోంది. సాగుపై ఒత్తిడి పెరుగుతోంది. జిల్లాలవారీగా చూస్తే 0.51 హెక్టార్లతో సగటు హోల్డింగ్ శ్రీకాకుళం అతితక్కువ కాగా గరిష్టంగా అనంతపురంలో 1.63 హెక్టార్లు.

### సన్నకారుపై తీవ్ర ప్రభావం

సన్నకారు రైతు కమతాలు ఐదేళ్ల క్రితం 49.84 లక్షలుండగా 59.04 లక్షలకు పెరిగాయి. మొత్తం హోల్డింగ్స్‌లో సన్నకారు తరగతి వాటా 65.40 శాతం నుండి 69.26 శాతానికి పెరిగింది. ఇదే సమయంలో వారి వద్ద భూమి 21.60 లక్షల హెక్టార్ల నుండి 23.36 లక్షల హెక్టార్లకు పెరిగింది. రాష్ట్రంలో మొత్తం సాగు భూమిలో వీరి వద్ద ఉన్న భూమి 26.68 శాతం నుండి 29.19 శాతానికి పెరిగింది. రాష్ట్ర సగటు హోల్డింగ్ సైజు కంటే సన్నకారు హోల్డింగ్ సైజు సగం తక్కువ. సన్నకారు రైతు కమతం సైజు 0.43 హెక్టారు నుండి 0.40 హెక్టారుకు కుదించుకుపోయింది. సన్నకారు రైతు కమతాలు తూర్పు గోదావరిలో గరిష్టంకాగా కడపలో కనిష్టం.

### చిన్న రైతూ అంతే

చిన్న రైతు కమతాలు 15.91 లక్షల నుండి 16.46 లక్షలకు పెరిగాయి. మొత్తం కమతాల్లో 20.88 శాతం నుండి 19.31 శాతానికి తగ్గాయి. వీరి చేతుల్లోని భూమి 22.51 లక్షల హెక్టార్ల నుండి 23.34 లక్షల హెక్టార్లకు పెరిగింది. మొత్తం సాగు భూమిలో చిన్న రైతుల వాటా 27.80 శాతం నుండి 29.16 శాతానికి పెరిగింది. చిన్న రైతు సగటు కమతం సైజు 1.41 హెక్టారు నుండి 1.42 హెక్టారుకు అతి స్వల్పంగా పెరిగింది. ఇక సెమీ మీడియం, మీడియం కమతాలు, వారి చేతుల్లో భూమి, సగటు కమతం సైజు ఈ కాలంలో తగ్గాయి. అనంతపురంలో చిన్న, సెమి మీడియం, మీడియం, కమతాలు గరిష్టంకాగా విజయనగరం, శ్రీకాకుళంలో కనిష్టం.

### భారీ భూకమతం పైకి

సగటు భారీ భూకమతం సైజు పెరిగింది. కమతాలు 20 వేల నుండి 15 వేలకు తగ్గగా మొత్తం కమతాల్లో 0.26 శాతం నుండి 0.18 శాతానికి తగ్గాయి. వారి చేతుల్లో భూమి 3.04 లక్షల హెక్టార్ల నుండి 2.76 లక్షల హెక్టార్లకు తగ్గింది. మొత్తం భూమిలో 3.75 శాతం నుండి 3.45 శాతానికి తగ్గింది. అయితే సగటు కమతం సైజు 15.28 హెక్టార్ల నుండి 18.71 హెక్టార్లకు పెరిగింది. ఈ పరిణామం భూకేంద్రీకరణను సూచిస్తోందని ఆర్థికవేత్తలు విశ్లేషిస్తున్నారు. పెద్ద కమతాలు అనంతపురంలో గరిష్టం కాగా శ్రీకాకుళం, గుంటూరులో సున్నాగా తెలిపారు. ✸

**ల్యాండ్ హోల్డింగ్స్**

| | కమతాలు లక్షలు | | సగటు సైజు హెక్టార్లు | |
|---|---|---|---|---|
| తరగతి | 2010-11 | 2015-16 | 2010-11 | 2015-16 |
| సన్నకారు | 49.84 | 59.04 | 0.43 | 0.40 |
| చిన్న | 15.91 | 16.46 | 1.41 | 1.42 |
| సెమిమీడియం | 7.96 | 7.70 | 2.64 | 2.62 |
| మీడియం | 2.30 | 1.89 | 5.56 | 5.49 |
| పెద్ద | 0.20 | 0.15 | 15.28 | 18.71 |
| రాష్ట్రం | 76.21 | 85.24 | 1.06 | 0.94 |




## మే 28, 29, 30 తేదీల్లో అనంతపురంలో

# ఎపి రైతు సంఘం రాష్ట్ర మహాసభ

ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం రాష్ట్ర మహాసభ మే 28, 29, 30 తేదీల్లో అనంతపురంలో జరగనున్నాయి. ఆ మేరకు అనంతపురంలో ఇటీవల మహాసభ ఆహ్వాన సంఘ సమావేశం జరిగింది. సంఘం జిల్లా అధ్యక్షులు నాగరాజు అధ్యక్షత వహించారు. సమావేశంలో రైతు సంఘం రాష్ట్ర ఉపాధ్యక్షులు పి.జమలయ్య మాట్లాడుతూ.. ఈ మహాసభకు ఆలిండియా కిసాన్ సభ (ఎఐకెఎస్) జాతీయ ప్రధాన కార్యదర్శి, మాజీ ఎంపి హన్నన్‌మొల్లా, జాతీయ సహాయ కార్యదర్శి విజ్జూ కృష్ణన్ ముఖ్య అతిథులుగా హాజరవుతారని తెలిపారు. మహాసభల మొదటి రోజు అంటే మే 28న వేలాది మంది రైతులతో బహిరంగ సభ జరుగుతుందని చెప్పారు. మహాసభలో రైతు సమస్యలపై మూడు రోజులపాటు పలు సదస్సులు జరుగుతాయని తెలిపారు. రాష్ట్రంలో రైతులు ఎదుర్కొంటున్న సమస్యలపై ఈ మహాసభలో చర్చించి భవిష్యత్తు పోరాటాలకు కార్యాచరణ రూపొందిస్తామని అన్నారు. ఈ



కార్యక్రమంలో రైతు సంఘం శ్రేయోభిలాషులు జి.ఓబులు, బోస్, వికె రంగారెడ్డి, ఒ. నల్లప్ప తదితరులు పాల్గొన్నారు.

**సమావేశంలో ఎన్నుకున్న ఆహ్వాన సంఘం ఇదీ**

అధ్యక్షులు : ప్రొఫెసర్ పురేంద్రప్రసాద్

గౌరవాధ్యక్షులు : ఎస్.ఎం. బాషా

ప్రధాన కార్యదర్శి : ఆర్.చంద్రశేఖరరెడ్డి

కోశాధికారి : తరిమెల నాగరాజు

వీరితోపాటు 100 మందితో కమిటీని ఎన్నుకున్నారు.

# రైతు సంఘం రాష్ట్ర మహాసభల లోగో ఆవిష్కరణ

ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం రాష్ట్ర మహాసభల కోసం రూపొందించిన లోగోను ఏప్రిల్ 3న రైతు రామప్ప చేతుల మీదుగా ఆవిష్కరించారు. అనంతపురంలోని రైతు బజారు ఆవరణంలో రైతు సంఘం రాష్ట్ర మహాసభల ఆహ్వాన సంఘం ఆధ్వర్యంలో ఈ కార్యక్రమాన్ని నిర్వహించింది. అనంతరం ఆహ్వాన సంఘం గౌరవ అధ్యక్షులు ఎస్ఎం.బాషా మాట్లాడుతూ మే 28, 29, 30 తేదీల్లో మూడు రోజుల పాటు ఎపి రైతు సంఘం రాష్ట్ర మహాసభలు అనంతపురం నగరంలో జరగనున్నాయని తెలిపారు. దేశంలోనే అత్యల్ప వర్షపాతం కలిగిన అనంతపురం జిల్లాలో వ్యవసాయం తీవ్రమైన సంక్షోభంలో ఉందని తెలిపారు. నిత్యం కరువులో ఇక్కడి వ్యవసాయ పరిస్థితులను రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల వారూ మహాసభల సందర్భంగా ఇక్కడికి విచ్చేసినప్పుడు ప్రత్యక్షంగా తెలుసుకునేందుకు వీలుంటుందని పేర్కొన్నారు. వారి మద్దతు సహకారమూ తమకు లభించేందుకు ఈ మహాసభలు దోహదపడతాయని చెప్పారు. అనేక ఆటంకాలు, పరిమితులున్నప్పటికీ ప్రజలందరి సహకారంతో మహాసభలు జయప్రదం కావాలని ఆకాంక్షించారు. సిఐటియు రాష్ట్ర నాయకులు జి.ఓబులు మాట్లాడుతూ.. నిత్యం కరువుకు నిలయమైన అనంతపురం జిల్లాలో వ్యవసాయంపై ఆధారపడిన రైతుల పరిస్థితులు చాలా దయనీయంగా ఉన్నాయని




చెప్పారు. ఆత్మహత్యలు అనివార్యమవుతున్న తరుణంలో వారిలో చైతన్యం నింపి పోరాటాల వైపు తీసుకెళ్లేందుకు ఈ రాష్ట్ర మహాసభలు దోహదపడతాయని చెప్పారు. ఇప్పటికే జయతీఘోష్, స్వామినాథన్ కమిషన్ నివేదికలు వ్యవసాయాన్ని ఏ రకంగా ఆదుకోవాలో సూచించాయని గుర్తు చేశారు. వాటిని అమలు చేయించుకునేందుకు ప్రభుత్వాలపై ఒత్తిడి పెంచాల్సిన అవసరముందన్నారు. మాజీ ఎమ్మెల్సీ డాక్టర్ గేయానంద్ మాట్లాడుతూ.. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కార్పొరేట్ అనుకూల విధానాలను అవలంభిస్తుండటంతో వ్యవసాయం మరింత సంక్షోభంలోకి నెట్టివేయబడుతోందన్నారు. ఈ విధానాలకు వ్యతిరేకంగా రైతులందరినీ సమీకరించి ఢిల్లీ తరహా మహోద్యమాన్ని రాష్ట్రంలోనూ రూపొందించాల్సిన అవసరముందన్నారు. ఆ దిశగా మే నెలలో ఇక్కడ జరగబోయే మహాసభల్లో నిర్ణయాలు జరగాల్సి ఉందని పేర్కొన్నారు. ఈ మహాసభలను జయప్రదం చేయడానికి జిల్లాలోని రైతులు, రైతు శ్రేయోభిలాషులు తమ వంతు సహకారం అందించాలని కోరారు. ఈ కార్యక్రమంలో ఎపి రైతు సంఘం జిల్లా ప్రధాన కార్యదర్శి ఆర్.చంద్రశేఖర్‌రెడ్డి, కౌలు రైతు సంఘం నాయకులు బాలరంగయ్య, ఎపి రైతు సంఘం జిల్లా నాయకులు రామిరెడ్డి, పోతులయ్య, బి.చంద్రశేకర్‌రెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# రైతులను నిలువునా ముంచిన 'కావేరి' పై బహుముఖ పోరాటం






జి.రామకృష్ణ

కావేరి కంపెనీ జాదూ పత్తి విత్తనాలు రైతులను నిలువునా ముంచేశాయి. ఖరీఫ్ సీజనులో కర్నూలు జిల్లాలో పత్తి ఎక్కువగా సాగయింది. సుమారు 2,55,696 ఎకరాల్లో పత్తి సాగయినట్లు ప్రభుత్వ గణాంకాలు తేటతెల్లం చేస్తున్నాయి. ఇతర పంటల కన్నా పత్తి పైరునే రైతులు ఎక్కువగా సాగు చేయడానికి కారణం.. పెట్టుబడి, వర్షం తక్కువయినా నిలబడుతుందని, ధర బాగా ఉంటే పెట్టుబడి ఖర్చులు పోను ఎకరాకు రూ.40 వేల నుండి రూ.50 వేల దాకా మిగిలే అవకాశం ఉంటుందని భావించి.. పత్తి పైరు సాగుకు శ్రీకారం చుట్టారు. అయితే విత్తన కంపెనీలు ఇదే అదునుగా భావించాయి. ఇబ్బడిముబ్బడిగా నకిలీ విత్తనాలు రైతులకు అమ్మాయి. ఈ సంవత్సరం కర్నూలు జిల్లాలో కావేరి కంపెనీ వారు తమ జాదు పత్తి విత్తనాలను రైతులకు విస్తృతంగా సరఫరా చేశారు. జూన్ నెలలో వేసిన విత్తనాలు బాగా పెరిగాయి కానీ పూత, పిందె రాలేదు. అప్పటికే విత్తనాలకూ, ఎరువులు – పురుగు మందులకూ, సేద్యం ఖర్చులకూ పెట్టుబడి పెట్టిన రైతులు పత్తి పైరును చూసి దిగ్భ్రాంతి చెందారు.

ఈ విషయాన్ని జిల్లా వ్యవసాయ శాఖ అధికారుల దృష్టికి తీసుకువెళ్లారు. అయినా వారి నుండి ఎలాంటి స్పందనా రాలేదు. ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం జిల్లా కమిటీ ఆధ్వర్యంలో ఆందోళనకు దిగక తప్పలేదు. రైతులందరూ రాజకీయాలకు అతీతంగా ఒక కమిటీగా ఏర్పడ్డారు. కావేరి కంపెనీ జాదు రకం పత్తి విత్తనాల వల్ల నష్టపోయిన రైతులకు నష్టపరిహారం ఇవ్వాలనే డిమాండ్‌ను కమిటీ ముందుకు తెచ్చింది. వివిధ రూపాల్లో ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకొచ్చింది. ఫలితంగా అధికారులు కదిలి నంద్యాల, గుంటూరుకు చెందిన లాం ఫారమ్ నుండి శాస్త్రవేత్తలు వచ్చి పంటలను పరిశీలించారు పంట దిగుబడి రాకపోవడానికి కారణం విత్తన లోపం వల్లనే అని తేల్చారు. ఆ మేరకు శాస్త్రవేత్తలు ప్రభుత్వానికి నివేదిక అందజేశారు.

ఇది రైతులు సంఘటితమై పోరాడి సాధించుకున్న మొట్టమొదటి ముందడుగు. శాస్త్రవేత్తలు ఇచ్చిన నివేదిక ఆధారంగా "2007 కాటన్ విత్తన చట్టం"ను ఉపయోగించి నష్టపోయిన రైతులకు పరిహారం ఇప్పించేందుకు జిల్లా వ్యవసాయ శాఖ అధికారులూ, జిల్లా కలెక్టరూ.. కావేరీ కంపెనీ యాజమాన్యతోనూ, బాధిత రైతులతోనూ సమావేశం నిర్వహించి అవార్డు ప్రకటించారు. ఒక ఎకరానికి రూ.23,307 చొప్పున 16 మండలాల్లోని 1,889 మంది రైతులకు చెందిన 7,258 ఎకరాల్లో నష్ట పోయిన పంటకు రూ.17 కోట్లు చెల్లించాలని నిర్ణయించారు. ఈ మేరకు కమిటీకి ఛైర్మన్‌గా ఉన్న వ్యవసాయ శాఖ జాయింట్ డైరెక్టరు.. కంపెనీ యాజమాన్యాన్ని ఆదేశించారు.

పై గణాంకాలు అధికారుల దృష్టికి వచ్చినవి మాత్రమే. అధికారుల దృష్టికి రాని రైతులు వేలాది మంది ఉన్నారు. అయితే అధికారులు ప్రకటించిన నష్టపరిహారం కూడా ఎగ్గొట్టడానికి కావేరి కంపెనీ యాజమాన్యం ఉన్నత న్యాయస్థానాన్ని ఆశ్రయించింది. పూత, పిందె రాకపోవడానికి తమ విత్తన లోపం కాదని, ప్రకృతి – వాతావరణం వల్లే దిగుబడి తగ్గిందని చెప్పింది. కోట్లాది రూపాయల నకిలీ పత్తి విత్తనాలను అంటగట్టిన కావేరి కంపెనీ రైతులను నిలువునా ముంచివేయడానికి ఆ విధంగా సిద్ధమైంది. కావేరి కంపెనీ యాజమాన్యం చేసే వాదన ఏమాత్రం సమర్థనీయం కాదు. అందులో ఇసుమంత వాస్తవం లేదు. ఎందుకంటే కావేరి జాదు రకం వేసిన పంట పక్కనే సదానంద, మోక్ష, గాయత్రి గోల్డ్ వేసిన వారికి మంచి దిగుబడి వచ్చింది. ఒక ఎకరానికి 8 క్వింటాళ్ల నుండి 15 క్వింటాళ్ల వరకు పత్తి దిగుబడి వచ్చింది. దీన్నిబట్టి వాతావరణం వల్ల కాదని, విత్తన లోపం వల్లనే దిగుబడి తగ్గిందని ఎవరైనా స్పష్టంగా అర్థం చేసుకుంటారు. కావేరి కంపెనీ వారు ప్రతి సంవత్సరం వందల కోట్ల రూపాయల విత్తన వ్యాపారం చేస్తున్నారు. వీరికి లాభం తప్ప రైతుల ప్రయోజనం ఏ మాత్రం పట్టదు. రైతుల కళ్ళు కప్పి, అధికారులను లోబర్చుకుని మార్కెట్లో జాదు రకం బిటి –2, బిటి –3 విత్తనాలను యథేచ్ఛగా అమ్ముతున్నారు. ఇందులో బిటి–3 విత్తనాల వల్ల పర్యావరణానికి ఎనలేని ముప్పు ఏర్పడే అవకాశం

వుంది. ఆరోగ్యం ఎంతగానో దెబ్బతింటుంది. పశువులు అనారోగ్యం బారిన పడతాయి. అయినప్పటికీ ఈ విత్తనాలను మార్కెట్లో అమ్ముతున్నారు దీన్నిబట్టి వ్యవస్థ ఏ రకంగా ఉందో అర్థం చేసుకోవచ్చు. కావేరీ కంపెనీ చెప్పే కల్లబొల్లి కథనాలపై ఆగ్రహించిన రైతులు.. ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం ఆధ్వర్యంలో జిల్లా కలెక్టర్ కార్యాలయాన్ని పలు దఫాలుగా ముట్టడించారు. ఈ కార్యక్రమంలో రాజ్యసభ పూర్వ సభ్యులు పి మధు కూడా పాల్గొని అరెస్టు అయ్యారు. జిల్లా రైతు సంఘం నాయకులనూ, రైతు కార్యకర్తలనూ, వందలాది మంది రైతులను అరెస్టు చేశారు. రైతులు జాతీయ రహదారిని రెండు గంటలపాటు దిగ్బంధం కూడా చేశారు.

దేశవ్యాప్తంగా నకిలీ విత్తనాలవల్ల ఒక కోటి టన్నులకు పైగా ఆహార ఉత్పత్తులు నష్టపోవాల్సి వస్తుందని తెలుస్తోంది. అయితే నకిలీ విత్తనాలు అమ్మే అక్రమార్కులకు సంకెళ్లు బిగించే సరైన చట్టం లేక పోవడమే దురదృష్టకరం. కనుక సాగుదారులకు తగిన పరిహారం ఇచ్చే సమగ్రమైన విత్తన చట్టం సత్వరమే పట్టాలు ఎక్కిస్తేనే రైతాంగానికి భరోసా ఒనగూరుతుంది. దేశానికి ఆహార భద్రత లభిస్తుంది.

కావేరి కంపెనీ వారి నకిలీ పత్తి విత్తనాలపై రాష్ట్ర ప్రభుత్వం స్పందించాలి. కంపెనీపై రెవెన్యూ రికవరీ చట్టాన్ని ప్రయోగించి తక్షణమే రైతులకు నష్టపరిహారం ఇప్పించి ఆదుకోవాలి. నకిలీ విత్తనాలు అమ్మిన కావేరి కంపెనీపై క్రిమినల్ కేసులు నమోదు చేసి దాన్ని బ్లాక్ లిస్టులో పెట్టాలి. కావేరి కంపెనీ విత్తనాలు అమ్మకుండా నిషేధించాలి. ఇవన్నీ కార్యరూపం దాల్చాలంటే పోరాటమే ఏకైక మార్గం. పోరాడితే సమస్య పరిష్కారం అవుతుంది. రైతులందరూ ఐక్యంగా ఉద్యమించాలి.

**(వ్యాసకర్త జిల్లా ప్రధాన కార్యదర్శి, ఏపీ రైతు సంఘం, కర్నూలు)**

# రబీ ధాన్యం సేకరణకు కలెక్టర్లకు ఆదేశాలు

**2021-22** రబీ సీజన్ ధాన్యం సేకరణ రాష్ట్రంలో ఏప్రిల్ 4వ తేదీ నుంచి ప్రారంభించాలని కలెక్టర్లకు పౌరసరఫరాల శాఖ ఎమ్‌డి నుంచి ఆదేశాలు వెళ్లాయి. ఆదేశాల ప్రకారం : ఖరీఫ్ సీజన్‌లో సేకరించిన విధంగానే రబీ సీజన్ సేకరణ జరుగుతుంది. ఇ-క్రాప్‌లో నమోదు చేసుకున్న వారి పంటను రైతుభరోసా కేంద్రాలు (ఆర్‌బికె) కొనుగోలు చేస్తాయి. అయితే కొత్త జిల్లాల ఏర్పాటు నేపథ్యంలో ఏ జిల్లా నుంచి ఎంత పంట వస్తుందోనన్న అంచనాలు పౌరసరఫరాల సంస్థకు ఇంకా అందలేదు. ఈ నేపథ్యంలో రబీ సీజన్ లక్ష్యం, ధాన్యం సేకరణ ప్రక్రియకు సంబంధించిన వివరాలను అధికారులు చెప్పలేని పరిస్థితి నెలకొంది. క్వింటాల్ ఎ గ్రేడ్ రకం ధాన్యం రూ. 1,960, సాధారణ రకం రూ. 1,940గా ప్రభుత్వం మద్దతు ధర ఇవ్వనుంది. ఇప్పటి వరకూ ప్రభుత్వం ధాన్యం సేకరణ చేయకపోవడంతో నెల్లూరు, చిత్తూరు జిల్లాల్లో దళారులు క్వింటా ధాన్యాన్ని కేవలం రూ. 1,588 నుంచి రూ. 1,600లకు మాత్రమే కొనుగోలు చేయడంతో రైతులు తీవ్రంగా నష్టపోవాల్సి వస్తోంది. రబీ ధాన్యం సేకరణలో జాప్యానికి కొత్త జిల్లాల ఏర్పాటు కూడా ఒక కారణమేనని తెలుస్తోంది. వాస్తవానికి మార్చి నెల



మొదటి వారంలో రబీ సేకరణ ప్రారంభించాల్సి ఉంది. కొత్త జిల్లాలు ఏర్పాటయ్యాక, ధాన్యం వచ్చే ప్రాంతాల్లోని మిల్లర్లతో అధికారులు మాట్లాడి, ఒప్పందాలు కుదుర్చుకోవాలని భావిస్తున్నారు. అందువల్ల రబీ సేకరణలో జాప్యం జరిగినట్లు సమాచారం. రబీ ధాన్యం సేకరణకు సంబంధించిన అన్ని చర్యలూ తీసుకోవాలని ఇప్పటికే కొత్తగా ఏర్పడిన జిల్లాల కలెక్టర్లకు పౌరసరఫరాల సంస్థ ఎమ్‌డి వీరపాండ్యన్ ఆదేశాలు జారీ చేసినట్లు తెలుస్తోంది

## ఆశిష్ మిశ్రా బెయిలుపై యుపి ప్రభుత్వ తీరు విస్మయ పరచింది : సుప్రీం వ్యాఖ్య

**ల**ఖింపూర్ ఖేరీ కేసులో ప్రధాన నిందితుడు కేంద్ర మంత్రి తనయుడు అయిన ఆశిష్ మిశ్రా బెయిలుకు వ్యతిరేకంగా యుపి ప్రభుత్వం సుప్రీం కోర్టులో ఎందుకు అప్పీలు చేయలేదని సర్వోన్నత న్యాయస్థానం సూటిగా ప్రశ్నించింది. ఈ విషయంలో యుపి ప్రభుత్వ తీరు విస్మయం కలిగిస్తోందని కోర్టు వ్యాఖ్యానించింది. ఆశిష్ మిశ్రాకు హైకోర్టు బెయిలు మంజూరు చేయడాన్ని వ్యతిరేకిస్తూ బాధితుల కుటుంబాలు దాఖలు చేసిన అప్పీలుపై సుప్రీం కోర్టు తన తీర్పును రిజర్వు చేసింది. నేర తీవ్రతను పరిగణనలోకి తీసుకుని ఆశిష్ మిశ్రా బెయిలుకు వ్యతిరేకంగా సుప్రీం కోర్టులో అప్పీలు చేయాలని ఈ కేసుపై దర్యాప్తు చేస్తున్న సిట్, దర్యాప్తు పర్యవేక్షణకు కోర్టు నియమించిన రిటైర్డ్ హైకోర్టు న్యాయమూర్తి స్పష్టంగా సూచించినా ప్రభుత్వం ఎందుకు పట్టించుకోలేదని చీఫ్ జస్టిస్ ఎన్‌వి రమణ నేతృత్వంలోని త్రిసభ్య ధర్మాసనం ప్రశ్నిస్తే యుపి ప్రభుత్వ తరపు న్యాయవాదులు నీళ్లునమిలారు. ఇచ్చిన వివరణలు కూడా ఆకుకు అందని, పోకకు పొందని రీతిలో ఉన్నాయి. ఏ పరిస్థితుల్లో సిట్‌ను ఏర్పాటు చేశామో, దర్యాప్తు పర్యవేక్షణకు రిటైర్డు పంజాబ్, హర్యానా హైకోర్టు న్యాయమూర్తిని ఏర్పాటు చేశామో తెలిసి కూడా ప్రభుత్వం ఇంత నిర్లక్ష్యంగా వ్యవహరించడాన్ని ఏమనాలి? అని సుప్రీం చీవాట్లు పెట్టింది. రైతులను, జర్నలిస్టును చంపడం దారుణమని, ఆశిష్ మిశ్రా పలుకుబడి కలిగిన వ్యక్తి అని, అతడ్ని బెయిలుపై విడుదల చేయడం వల్ల ఆధారాలను తారుమారు చేసే ప్రమాదముంది. అయినా బెయిలు ఆర్డర్‌పై యుపి ప్రభుత్వం ఎందుకు అప్పీలు చేయలేదని సుప్రీం కోర్టు ప్రశ్నించింది.

ప॥ గోదావరి జిల్లా సమాచారం

# రబీ ధాన్యం అమ్మాలంటే అష్ట కష్టాలు







కె. శ్రీనివాస్

**కొనుగోలు ని'బంధనాలు' రైతుల పాలిటి శాపాలు**

**ఖరీఫ్ ధాన్యానికి 4 నెలలైనా చెల్లింపుల్లేవ్!**

రాష్ట్రంలో మరికొద్ది రోజుల్లో రైతుల చేతికి రబీ ధాన్యం వస్తుంది. అత్యధిక భాగం వరి పంట ఈనిక దశను పూర్తి చేసుకుని పాలు పోసుకుని గింజ తయారయ్యే దశకు చేరుకుంది. ఉభయ గోదావరి జిల్లాల్లోనే రబీలో అత్యధిక భాగం రైతులు వరి పంటను సాగు చేస్తున్నారు. ధాన్యం ఉత్పత్తిలో అగ్రభాగం కౌలు రైతులదే. కష్టపడి పండించిన ధాన్యాన్ని అమ్ముకునేందుకు అన్నదాతలు అష్టకష్టాలు పడుతున్నారు. కొనుగోలు నిబంధనలు రైతుల పాలిట శాపాలుగా మారాయి. పంట పండించడం కంటే అమ్ముకోవడానికే రైతు ఎక్కువ కష్టపడాల్సి వస్తోంది. ఖరీఫ్ ధాన్యం అమ్మి నాలుగు నెలలు అవుతున్నా నేటికీ చేతికి డబ్బులు అందక అనేకమంది రైతులు, కౌలు రైతులు రైతు భరోసా కేంద్రాల చుట్టూ కాళ్లకు చెప్పులు అరిగేలా తిరుగుతున్నారు.

ఉత్పత్తి ఖర్చులు విపరీతంగా పెరిగిపోయాయి. ఎరువులు, పురుగు మందుల ధరలను దారుణంగా పెంచేశారు. రోజు రోజుకూ పెరిగిపోతున్న పెట్రోల్, డీజిల్ ధరలతో ట్రాక్టర్ల కిరాయిలు పెంచేశారు. పెరిగిన ఉత్పత్తి ఖర్చులకు అనుగుణంగా ధాన్యానికి మద్దతు ధర మాత్రం పెరగలేదు. కేంద్ర ప్రభుత్వం 2022 నాటికి రైతుల ఆదాయాన్ని రెట్టింపు చేస్తామని హామీ ఇచ్చింది. రాష్ట్ర ప్రభుత్వం మాత్రం రైతు భరోసా కేంద్రాలతో రైతుకు భరోసా కల్పించామని గొప్పగా ప్రచారం చేసుకుంటున్నది. ఆచరణలో మాత్రం అన్నదాతకు కష్టాలు తప్పడం లేదు. కొనుగోలు నిబంధనల పేరుతో మిల్లర్లు, దళారులు రైతును నిలువునా దోచేస్తున్నారు. కొనుగోలు కేంద్రాలు ఏర్పాటు చేశామని ప్రభుత్వం ప్రచారం చేస్తున్నా.. రైతుల నుండి గింజ కూడా కొనడం లేదు. కమీషన్ ఏజెంట్లు, మిల్లర్లు కొన్న ధాన్యాన్నే కొనుగోలు కేంద్రాల ద్వారా కొన్నట్లుగా చూపిస్తున్నారు. కల్లాల నుండే ధాన్యం కొనుగోలు చేస్తున్నామని జిల్లాల్లో అధికారులు చెబుతున్నా ఆచరణ అందుకు విరుద్ధంగా ఉన్నది.

స్వామినాథన్ కమిషన్ సిఫార్సులకు అనుగుణంగా ఉత్పత్తి ఖర్చులకు అదనంగా 50 శాతం కలిపి మద్దతు ధర నిర్ణయించి అమలు చేయాలని రైతు సంఘాలు కోరుతున్నాయి. కేంద్ర ప్రభుత్వం మాత్రం ఉత్పత్తి ఖర్చులను తక్కువ చూపి మద్దతు ధర ప్రకటిస్తున్నది. ఆ ధర రైతు పెట్టిన పెట్టుబడి ఖర్చు కంటే తక్కువగా ఉంటుంది. అయితే ఆ మద్దతు ధర కూడా రైతుకు అందడం లేదు. రబీ ధాన్యానికి కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన మద్దతు ధర 75 కిలోల బస్తాకు 'ఏ గ్రేడ్' కు రూ.1470, సాధారణ రకానికి రూ.1455 గా ఉంది. అయితే ఈ ధర కనీసంగా రూ.2 వేలు ఉంటే గానీ రైతుకు పెట్టుబడి ఖర్చులు రావు. పైగా కొనుగోలు నిబంధనలతో నష్టపోతున్నారు. ఎకరాకు కౌలుతో కలుపుకుని పెట్టుబడి రూ.55 వేల నుండి రూ.60 వేల వరకు అవుతున్నది. సరాసరి దిగుబడి మాత్రం 40 బస్తాల వరకు వస్తున్నది. ఈ దిగుబడితో రైతుకు మిగులు లేకపోయినా పెట్టిన పెట్టుబడి ఖర్చులు వస్తున్నాయి. కౌలు రైతుకు గడ్డి కూడా మిగలడం రావడం లేదు.

### లోప భూయిష్టంగా ఈ-క్రాప్ నమోదు..

రైతు ధాన్యం అమ్మాలంటే ఈ క్రాప్ నమోదు తప్పనిసరి. ప్రస్తుతం ఈ-క్రాప్‌తో పాటు ఈ కేవైసీ కూడా పూర్తి కావాల్సి ఉంది. అయితే ఈ-క్రాప్ నమోదులో కౌలు రైతుల పేర్లను నమోదు చేయడం లేదు. పంటలు సాగు చేయని భూ యజమానుల పేర్లనే నమోదు చేస్తున్నారు. ఫలితంగా భూ యజమానుల పేరుతోనే ధాన్యం కొనుగోలు చేస్తున్నారు. కౌలు రైతులకు పంట సాగుదారు హక్కు పత్రాలు అందడం లేదు. పంట సాగుదారు హక్కు పత్రాలు ఇచ్చినా ఈ-క్రాప్ నమోదులో కౌలు రైతులకు అన్యాయం జరుగుతోంది. ధాన్యం డబ్బులు భూ యజమానుల బ్యాంకు ఖాతాలకే జమ చేస్తున్నారు. కొద్దిమంది కౌలు రైతులు మాత్రమే తమ పేర్లతో ధాన్యం అమ్ముకో గలుగుతున్నారు. గతంలో రుణ అర్హత కార్డులు ఆధారంగా కౌలు రైతులు తమ పేర్లతోనే ధాన్యం అమ్ముకో గలిగారు. ప్రస్తుతం ఆ పరిస్థితి లేదు. రాష్ట్రంలో జగన్ మోహన్ రెడ్డి ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తర్వాత కౌలు రైతుల పరిస్థితి దారుణంగా తయారైంది. భూ యజమానుల

ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా ఈ-క్రాప్‌లో కౌలు రైతుల పేర్లను నమోదు చేయాలి.

### గోనె సంచుల కొరత

రైతులు ధాన్యం విక్రయించాలంటే ప్రభుత్వం కొనుగోలు కేంద్రాల ద్వారా గోనె సంచులను సరఫరా చేయాల్సి ఉంది. అయితే తగినన్ని గోనె సంచులు అందుబాటులో లేవు. మిల్లర్ల వద్దనే గోనె సంచులు ఉండడం వలన వారి వద్దకు వెళ్లి సంచులు తెచ్చుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతున్నది. రైతు భరోసా కేంద్రాలు వద్ద గోనె సంచులు అందుబాటులో ఉంచడం లేదు. మిల్లర్ల దయాదాక్షిణ్యాలపై ఆధారపడాల్సి వస్తోంది. ఫలితంగా ధాన్యం వారి చెప్పిన ధరకే అమ్ముకోవాల్సిన పరిస్థితిని ప్రభుత్వమే రైతుకు కల్పిస్తోంది. చినిగిన గోనె సంచులు ఇస్తున్నారు. రైతు కష్టపడి పండించిన ధాన్యం చిరిగిన గోనె సంచులు వలన నేలపాలు అవుతున్నది.

### తేమ శాతం లెక్కింపు, తూకాల్లో మోసాలు..

కొనుగోలు నిబంధన ప్రకారం 17 శాతం ధాన్యంలో తేమ వుండాలి. అత్యధిక భాగం వరి కోతలు మిషన్ల ద్వారా జరుగుతున్నాయి. మిషన్లు కోతలు వలన తేమ ఎక్కువ ఉండే అవకాశం ఉన్నది. రైతులు ధాన్యం ఆరబెట్టి తీసుకువెళ్లిన సందర్భాల్లో కొనుగోలు కేంద్రాలలో 17 శాతం తేమ ఉన్నదని నిర్ధారణ చేసి తర్వాత కూడా మిల్లర్లు వద్ద అధిక తేమ శాతం ఉన్నట్లు చూపి మద్దతు ధరలో కోతలు పెడుతున్నారు. ధాన్యం కొనుగోళ్లలో మిల్లర్ల ప్రమేయం లేదని చెబుతున్నా ఆచరణలో మిల్లర్లు చెప్పిన విధంగానే ధాన్యం కొనుగోళ్లు జరుగుతున్నాయి. తేమ శాతం లెక్కింపులో అవకతవకలు అరికట్టాలి. తూకాల్లో మోసాలు జరుగుతున్నాయి. తరుగు పేరుతో క్వింటాలుకు 2 నుండి 3 కిలోలు కోత పెడుతున్నారు. ఎకరాకు క్వింటా ధాన్యం రైతులు నష్టపోతున్నారు.

### ధాన్యం డబ్బులు కోసం ఎదురు చూపులే..

రైతులు ఆరుగాలం కష్టపడి ధాన్యం పండించి అష్టకష్టాలు పడి అమ్మితే డబ్బులు కోసం నెలలు తరబడి ఎదురుచూడాల్సిన పరిస్థితి వస్తోంది. గతంలో ధాన్యం విక్రయించిన 72 గంటల్లో డబ్బులు చెల్లిస్తామని నిబంధన ఉంది. ఆ నిబంధన కాస్త జగన్మోహన్ రెడ్డి ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తర్వాత 21 రోజులుగా మార్చారు. 21 రోజులు కాదు కదా రెండు మూడు నెలలు అవుతున్నా రైతు చేతికి డబ్బులు అందడం లేదు. పెట్టుబడి తెచ్చిన అప్పులకు ఒకవైపు వడ్డీలు పెరిగిపోతున్నాయి. తిరిగి పంట వేయాలంటే రైతుకు అప్పులు పుట్టడం లేదు. కేంద్ర ప్రభుత్వం కూడా వరి రైతుల పట్ల నిర్లక్ష్యంగా వ్యవహరిస్తోంది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు విధానాలతో వరి రైతుకు ఉరి వేస్తున్నారు. వరి రైతు తెగించి పోరాడితే గానీ ధాన్యం కొనుగోళ్ల సమస్యలు పరిష్కారం కావు.

(వ్యాసరచయిత ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం పశ్చిమగోదావరి జిల్లా కార్యదర్శి)

# యు వన్ రిజర్వ్‌జోన్‌ను రద్దు చేయాల్సిందే

## తాడేపల్లిలో రైతుల భూములు పరిశీలన

రైతులు సాగు చేస్తోన్న పచ్చని సారవంతమైన పంట పొలాలపై ఉన్న 'యు వన్ రిజర్వ్' జోన్‌ను రద్దు చేయాలని ఎపి రైతు సంఘం రాష్ట్ర ఉపాధ్యక్షులు వి.శ్రీనివాసరావు డిమాండ్ చేశారు. గుంటూరు జిల్లా తాడేపల్లి, కుంచనపల్లి, కొలనుకొండ గ్రామాల్లోని 'యు వన్ రిజర్వ్' భూములను ఎపి రైతు సంఘం, సిపిఎం నేతలతో కలిసి ఆయన పరిశీలించారు. ఈ సందర్భంగా శ్రీనివాసరావు మాట్లాడుతూ.. 320 మంది రైతులకు చెందిన 178 ఎకరాలను 2016లో అప్పటి టిడిపి ప్రభుత్వం యు వన్ జోన్‌గా ప్రకటించిందని, ఇది రైతుల స్వేచ్ఛను హరించేలా ఉందని తెలిపారు. ఈ సమస్య తమ పరిధిలోనిది కాదని సిఆర్‌డిఎ అధికారులు చెబుతున్నారన్నారు. సమస్యను పరిష్కరిస్తానని ఎమ్మెల్యే ఆళ్ల రామకృష్ణారెడ్డి ఇచ్చిన హామీ అమలుకు నోచుకోలేదన్నారు. బహుళ అంతస్తుల భవనాలు నిర్మించుకోవడానికి కాంట్రాక్టర్లకు, బిల్డర్లకు ప్రభుత్వం అనుమతులిచ్చినా, రైతులకు మాత్రం వారి భూములపై వారికి హక్కుల్లేకుండా చేయడం తగదన్నారు. బిల్డర్లు, కాంట్రాక్టర్లకు రైతుల భూములను కారుచౌకగా కట్టబెట్టేందుకు ఈ కుట్ర జరుగుతోందని, సిఎం నివాసముండే ఈ ప్రాంతంలో రైతుల సమస్యలు పట్టించుకోవడంలేదని విమర్శించారు. ఎపి కౌలురైతు సంఘం రాష్ట్ర



యు వన్ భూముల పరిశీలన సమయంలో పసుపు పొలంలో అరక దున్నుతున్న వి.శ్రీనివాసరావు

ప్రధాన కార్యదర్శి పి.జమలయ్య మాట్లాడుతూ.. యు వన్ జోన్‌ను ఎత్తేయకుంటే పోరాటం తప్పదన్నారు. అనంతరం స్థానిక రైతు పసుపు పొలంలో పని చేస్తుండగా శ్రీనివాసరావు అతనితో మాట్లాడుతూ కొద్దిదూరం అరక దున్నారు. ఈ కార్యక్రమంలో ఎపి రైతు సంఘం తూర్పు గుంటూరు జిల్లా కార్యదర్శి జన్నా శివశంకరరావు, సిపిఎం తాడేపల్లి మండల, పట్టణ కార్యదర్శులు కార్యదర్శి డి.వెంకటరెడ్డి, బి.వెంకటేశ్వర్లు తదితరులు పాల్గొన్నారు.

కృష్ణా జిల్లా సమాచారం

# మామిడికి నల్లమచ్చ పురుగు రైతుల నిరాశ





పి.వి. ఆంజనేయులు

'కాలం కలిసి రాకుంటే కాసులు పూసలు అవుతాయి' అనే సామెతను ఈ ఏడాది మామిడి సాగు గుర్తు చేస్తున్నది. కొన్నేళ్లుగా రైతులకు మామిడి సాగు నష్టాలను మూటగట్టి ఇస్తోంది. ప్రస్తుతం ఒక వైపు ప్రకృతి అనుకూలించకపోవడం, మరోవైపు నల్లమచ్చ పురుగు వ్యాపించడంతో పూత, పిందె రాలిపోతున్నాయి. పెట్టిన పెట్టుబడులు బూడిదలో పోసిన పన్నీరవుతాయని రైతులు ఆందోళన చెందుతున్నారు. కృష్ణాజిల్లా వ్యాప్తంగా దాదాపు ఒక లక్షా 70 వేల ఎకరాల్లో మామిడి తోటలు విస్తరించి ఉన్నాయి. నూజివీడు, మైలవరం, ఆగిరిపల్లి, విస్సన్నపేట, తిరువూరు సహా 12 మండలాల్లో ఈ తోటలు విస్తరించి ఉన్నాయి. వేలాది మంది రైతులు మామిడి సాగు చేస్తున్నారు. అన్ని పంటలకు మాదిరిగానే ఇక్కడా మామిడి తోటలను కౌలుకు తీసుకునే విధానం కొనసాగుతోంది.

### అనుకూలించని ప్రకృతి

ఏటా నవంబరు, డిసెంబరు నెలల్లో పూత దశలో ఉండే మామిడి తోటలు ఈ యేడాది ఫిబ్రవరిలో కూడా పూర్తి స్థాయిలో పూత పూయలేదు. జనవరిలో కురిసిన అకాల వర్షాలకు పూసిన పూత మాడిపోయింది. పిందె దశలో ఉన్న కొన్ని తోటల్లో త్వరగా కాయ ఎదుగుదలకు రావడానికి రైతులు ఎక్కువగా క్రిమి సంహారక మందులు పిచికారీ చేశారు. దీనివల్ల కాయలు రాలిపోతున్నాయి. వీటన్నిటికితోడు ఈ యేడు పూత దశలో నల్లమచ్చ పురుగు వ్యాపించింది. దీనివల్ల పూత రాలడంతోపాటు ముందస్తుగా వచ్చిన కాయలు కూడా రాలిపోతున్నాయని రైతులు అంటున్నారు. దీంతో దిగుబడి గణనీయంగా తగ్గిందని, పెట్టిన పెట్టుబడులు రావడం గగన కుసుమమే అని రైతులు అంటున్నారు.

### రైతుల్లో గుబులు

రెండేళ్లుగా కరోనా ప్రభావంతో మామిడి ఎగుమతుల్లేక నష్టాలను చవిచూసిన రైతులు.. ఈ యేడు కూడా దిగుబడులు రాక నష్టాలు మూటగట్టుకునే ప్రమాదం ఏర్పడింది. ఎకరానికి రూ.20 వేల నుంచి రూ.30 వేల వరకూ పెట్టుబడులు పెట్టారు. వీటి గురించే రైతులు మధనపడుతున్నారు.

### అలంకార ప్రాయంగా పరిశోధనా కేంద్రాలు

మామిడి రైతులకు సలహాలు, సూచనలు ఇచ్చేందుకు మామిడి పరిశోధనా కేంద్రాలు ఉన్నాయి. అవి అలంకార ప్రాయంగా వున్నాయే తప్ప ఉపయోగం లేదు. రైతులకు సలహాలూ, సూచనలూ ఇచ్చేందుకు అధికారులూ, శాస్త్రవేత్తలూ పరిశోధనా కేంద్రాలు దాటి అడుగు బయటకు పెట్టడం లేదు. దీనివల్ల రైతులు తమకు తోచిన విధంగా క్రిమి సంహారక మందులు వాడుతున్నారు. సలహాల్లేక ఇలా విచ్చలవిడిగా మందులు వాడటం వల్ల తోటలు దెబ్బతిన్నాయి. ఫలితంగా దిగుబడులు తగ్గిపోయే ప్రమాదం తలెత్తింది. పండ్లలో రారాజుగా పిలవబడే మామిడి పంట పరిస్థితి ప్రస్తుతం ఇలా వుంది.

### ఎగుతుల్లేక రైతు డీలా

కరోనా ప్రారంభమైన కొత్తలో అంటే 2020 మే నెలలో 12 టన్నుల బంగినపల్లి మామిడి పండ్లు లండన్‌కు ఎగుమతి అయ్యాయి. విశాఖ ఓడ రేవు నుంచి ఈ ఎగుమతులు జరిగాయి. ఆ తరువాత దాదాపు ఎగుమతులే లేవని చెప్పాలి. 2021 మే నాటికి లాక్ డౌన్ కారణంగా మామిడి ఎగుమతులు లేకుండా పోయాయి. నున్న మామిడి మార్కెట్ ఆసియాలో పెద్ద ఎగుమతి కేంద్రంగా ఉంది. అలాంటిది ఎగుమతులు లేక మామిడి రైతు తీవ్రంగా నష్టపోయాడు. ఈ యేడాది ఏప్రిల్ రాబోతోంది. సాధారణంగా మామిడి ఎగుమతికి నూజివీడు, తిరుపతి ఎగుమతి కేంద్రాలుగా ఉన్నాయి. ఈ యేడు ఎగుమతులు ఉంటాయో లేదో తెలియని పరిస్థితి. ఒక వేళ ఎగుమతులే లేకుంటే మామిడి పండ్లను పూర్తిగా దేశీయ మార్కెట్‌లోనే అమ్ముకోవాల్సి ఉంటుంది. ప్రస్తుతం నల్లమచ్చ పురుగు కారణంగా దిగుబడులు గణనీయంగా తగ్గే అవకాశం ఉండటంతో మామిడి రైతు సంతోషంగా లేదు.

**(వ్యాస రచయిత కృష్ణా జిల్లా రైతు సంఘం కార్యదర్శి)**

# పత్తా లేని బీమా కంపెనీ

## • వాటా నిధులివ్వని కేంద్రం • నోరు మెదపని రాష్ట్ర సర్కారు

విపత్తులతో పంటలు నష్టపోయిన రైతులకు బీమా సులభతరం చేసేందుకు రాష్ట్ర ప్రభుత్వం సొంతంగా నెలకొల్పదలచిన ఇన్సూరెన్స్ కంపెనీ పత్తా లేదు. ఇన్సూరెన్స్ రెగ్యులేటరీ డెవలప్‌మెంట్ అథారిటీ ఆఫ్ ఇండియా (ఐఆర్‌డిఎఐ) వద్ద ఎపి సర్కారు అభ్యర్ధన మూలుగుతోంది. ఐఆర్‌డిఎఐ పలుమార్లు అభ్యంతరాలు, సందేహాలు వెలిబుచ్చడమే కాకుండా వివరణలు కోరడం, ప్రభుత్వం సమాధానాలు పంపడంతోనే కాలం గడిచిపోతోంది. ఇన్సూరెన్స్ కంపెనీపై ఎటూ తేలకపోవడంతో పంటల బీమా భారం మొత్తం ప్రభుత్వమే మోస్తోంది. కేంద్రానికి చెందిన ఫసల్, వాతావరణ ఆధారిత బీమా పథకాల నుండి ఎపి వైదొలగడంతో రెండున్నరేళ్లుగా కేంద్రం రాష్ట్రానికి ఒక్క రూపాయి ఇవ్వలేదు. దాదాపు రూ.1,500 కోట్లు కేంద్రం ఎగనామం పెట్టినట్లు సమాచారం. ఐఆర్‌డిఎఐ వద్ద దరఖాస్తు పెండింగ్ పడినా, కేంద్రం రైతుల ప్రీమియంలో తన వాటా ఇవ్వకపోయినా ఎపి సర్కారు గమ్మునుందని ఆరోపణలొస్తు న్నాయి.

### రెండేళ్లు దాటినా...

కేంద్ర బీమా పథకాల అమలు ప్రైవేటు కంపెనీలకు అప్పగించ డంతో రైతులకు న్యాయం జరగట్లేదని భావించిన వైసిపి ప్రభుత్వం సొంతంగా 'ఎపి జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ లిమిటెడ్' (ఎపిజిఐసిఎల్)ను 2013 కంపెనీల చట్టం కింద నమోదు చేయించేం దుకు ఆర్థిక శాఖ 2019 డిసెంబర్ 20న జిఒఎంఎస్ నెం.157 జారీ చేసింది. రూ.101 కోట్ల ప్రభుత్వ ఈక్విటీ ప్రతిపాదించింది.

ప్రభుత్వ అధికారులే షేర్ హోల్డర్లు, ప్రొమోటర్లు. కంపెనీల రిజిస్ట్రార్ వద్ద రిజిస్ట్రేషన్‌కు ఐఆర్‌డిఎఐ నో అబ్జక్షన్ సర్టిఫికేట్ (ఎన్‌ఒసి) ఇవ్వాలి. డాక్యుమెంట్ల తయారీకి 2020 మే 19న కంపెనీ సెక్రటరీకి రూ.83.13 లక్షలు మంజూరు చేస్తూ జిఒఆర్‌నెం.1396 జారీ చేశారు. రెండేళ్లకుపైగా ఐఆర్‌డిఎఐ వద్ద తెమలకుండా ఉంది. దాంతో ప్రభుత్వం 2019-20 రబీ నుండి సొంత నిధులతో ఉచిత పంటల బీమా అమలు చేస్తోంది.



### 1500 కోట్లు రావాలి

కేంద్రం 2016 ఖరీఫ్ నుండి ఫసల్, తాజా పరిచిన వాతావరణ ఆధారిత బీమాలను తీసుకొచ్చింది. అప్పటి వరకు ప్రభుత్వరంగంలోని అగ్రికల్చర్ ఇన్సూరెన్స్ కంపెనీ (ఎఐసి) మాత్రమే పంటల బీమా అమలు చేసేది. కేంద్రం ప్రైవేటు కంపెనీలనూ ఆ రంగంలోకి ప్రవేశపెట్టింది. వేలంలో కంపెనీలు నిర్ణయించిన ప్రీమియం శాతంలో, ఖరీఫ్‌లో అయితే రైతుల వాటా 2 శాతం, రబీలో 1.5 శాతం. హార్టికల్చర్ తోటలకు 5 శాతం. రైతుల వాటా పోను మిగిలిన ప్రీమియంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చెరిసగం పెట్టుకోవాలి. కాగా ఏ కంపెనీతోనూ సంబంధం లేకుండా, కేంద్రం నుండి విడగొట్టుకొని, ఉచిత పంటల బీమా తెచ్చాక, మొత్తం ప్రీమియం, క్లెయిముల సెటిల్మెంట్ బాధ్యత రాష్ట్ర ప్రభుత్వంపై పడింది. 2019-20 రబీ, 2020 ఖరీఫ్, 20-21 రబీ, 2021 ఖరీఫ్, 21-22 రబీ...ఐదు సీజన్ల బీమాకు కేంద్రం ఒక్క రూపాయి ఇవ్వలేదు. కేంద్రం ప్రతిపాదించిన ఫసల్, వాతావరణ బీమా మార్గదర్శకాలనే రాష్ట్రం అమలు చేస్తున్నప్పటికీ, ప్రీమియంలో తన వాటాను కేంద్రం, రాష్ట్రానికి విడుదల చేయడంలేదు. ఐదు సీజన్లకూ కలిపి రూ.1,500 కోట్ల వరకు కేంద్రం ఇవ్వాలి. కాగా ఆర్థిక ఇబ్బందుల్లో ఉండి కూడా ఎపి సర్కారు కేంద్రాన్ని అడగట్లేదు. మరోవైపు బీమాకు ఇ-క్రాప్ నమోదు తప్పనిసరి చేయడం, పలు షరతుల వలన రైతులు బీమా పొందలేకపోతున్నారు.

---

# లఖింపూర్ ఖేరీ కేసు సాక్షులపై దాడి

## పిటిషన్‌పై అత్యవసరంగా విచారించండి సుప్రీం కోర్టును కోరిన న్యాయవాది ప్రశాంత్ భూషణ్

లఖింపూర్ ఖేరీ కేసులో సాక్షుల్లో ఒకరిపై గురువారం దాడి జరిగిందని, ఈ కేసులో ప్రధాన నిందితుడు ఆశిష్ మిశ్రాకు మంజూరైన బెయిల్‌పై అప్పీల్‌ను అత్యవసరంగా జాబితా చేయాలని న్యాయవాది ప్రశాంత్ భూషణ్ శుక్రవారం సుప్రీంకోర్టును కోరారు. సుప్రీం కోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ ఎన్‌వి రమణ ఈ నెల 15న జాబితా చేస్తారని చెప్పారన్నారు. ఈ అంశాన్ని శుక్రవారం జాబితా చేయాలని గతంలో కోర్టు ఆదేశించినా, అది కాజ్‌లిస్ట్‌లో కనిపించలేదని ప్రశాంత్ భూషణ్ తెలిపారు. "శుక్రవారం విచారణ జరగాల్సి ఉంది. గురువారం రాత్రి కేసు ప్రధాన సాక్షుల్లో ఒకరిపై దాడి జరిగింది" అని భూషణ్




వివరించారు. దీనిపై సిజెఐ జస్టిస్ రమణ జోక్యం చేసుకొని "అది మా కార్యాలయం పొరపాటు. ఇది మంగళవారం జాబితా చేయబడుతుంది" అని బదులిచ్చారు.

# భారత వ్యవసాయ రంగ పరిణామ క్రమం - 3







ప్రొఫెసర్ ఎన్. వేణుగోపాలరావు
సెల్ : 9490098905


## హరిత విప్లవ దశ

నాలుగో పంచవర్ష ప్రణాళిక ఫలితాలు కూడా (1969-74) ప్రారంభంలో నిరాశాజనకంగా ఉన్నా 1971 పంట కాలానికి దాదాపు 108 మిలియన్ టన్నుల తిండిగింజల్ని పొందడం, మన వ్యవసాయ రంగానికి కొత్త ఊపు రావడం, దానికి కారణమైన ప్రత్యేకమైన సాంకేతిక పరిజ్ఞాన ఫలితాలన్నిటినీ గుర్తింపులోకి తేవడం దాన్నే హరిత విప్లవం పేరుతో పిలవడం జరిగింది. ఈ మార్పు వెనుక నూతనంగా రూపొందించబడిన విత్తనాలు, వ్యాప్తిలోకి తేబడ్డ రసాయన ఎరువులు, విస్తరించిన సాగునీటి సౌకర్యాలు ఉన్నాయని అనేకమంది గుర్తించారు. అంతర్జాతీయంగా తెచ్చిన మార్పులో భాగంగా మెక్సికో గోధుమ రకాలు; మలేషియా, జపాన్, ఫిలిపైన్స్ (చైనా) వరి రకాలు, ఆఫ్రికా వేరుశనగ రకాల ద్వారా "మిరకిల్ సీడ్స్" అభివృద్ధికి నాంది పలకడం జరిగింది. రష్యా సహాయంతో రసాయన ఎరువుల కర్మాగారాల్ని రూపొందించుకోవడం, కొత్తకొత్త ఆనకట్టలు కట్టి నీటి పారుదల సౌకర్యాన్ని పెంచడం మరో మార్పు. తద్వారా వర్షాధార పరిస్థితి మీద ఆధారపడిన స్థితి నుంచి కొన్ని ముఖ్య ప్రాంతాలు బయట పడటం జరిగింది. ఈ మార్పుకు ప్రొఫెసర్ ఎం.ఎస్.స్వామినాథన్, సి.సుబ్రహ్మణ్యం వంటివారు అనుసంధాన కర్తలుగా ఉండటం, పదేపదే పేర్కొనబడటం మనకు తెలుసు. ఈ వరవడి 1978-79 నాటికి 130 మిలియన్ టన్నుల తిండిగింజలు లభించేటట్లు చేయడం గమనించాల్సిన విషయం. ఆ క్రమంలోనే డాక్టర్ ఎం.వి. రావు వంటి ప్రముఖుల నేతృత్వంలో నూనెగింజల అభివృద్ధి పథకాల ద్వారా కొంత స్వయంసమృద్ధిని సాధించగలిగాము.

**హరిత విప్లవ ప్రారంభ దశలో తిండి గింజల దిగుబళ్ల పెరుగుదల ద్వారా వ్యవసాయ రంగ అభివృద్ధి నమూనా**

| సంవత్సరం | తిండిగింజల దిగుబడి (మిలియన్ టన్నుల్లో) |
|---|---|
| 1970-71 | 108.4 |
| 1971-72 | 105.2 |
| 1972-73 | 95.2 (లోటు) |
| 1973-74 | 104.6 |
| 1974-75 | 99.8 (లోటు) |
| 1975-76 | 121.03 |
| 1976-77 | 111.60 (లోటు) |
| 1977-78 | 126.41 |
| 1978-79 | 130.00 |
| 1980-81 | 132.00 |
| 1990-2000 | 190.00 |
| 2000-2010 | 213.00 |
| 2010-2020 | 297.00 |

నూతన వ్యవసాయానికి , కావల్సిన కృత్రిమ వనరులైన ఎరువులు, విత్తనాలు, సస్యరక్షణ మందులు, సాగునీరు వంటి వాటి విలువ 1970ల్లో 15 బిలియన్ డాలర్లయితే, 1980ల్లో 26.6 బిలియన్లు, 1990ల్లో 42.3 బిలియను డాలర్లుగా అంచనా వేయబడింది.

| హరిత విప్లవదశలో వివిధ కృత్రిమ వనరుల వాడక స్థాయిని తెలిపే అంచనా (బిలియన్ అమెరికన్ డాలర్లు) | | | | | |
|---|---|---|---|---|---|
| కృత్రిమ వనరులు /దశాబ్దాల సగటు | 1970 | 1980 | 1990 | 2000 | 2010 |
| రసాయన ఎరువులు | 4.9 | 13.0(195) | 25.9(99) | 69.3(కి/హె) | 144 |
| విత్తనాలు | 5.0 | 6.2 (24) | 7.2 (16) | 47.2 (శాతం) | 62.5 (శాతం) |
| సస్యరక్షణా మందులు | 0.7 | 1.2 (71) | 1.9 (58) | 0.92 | 0.7 |
| నీటిపారుదల వసతులు | 4.9 | 6.2 (27) | 7.3 (18) | 31 శాతం | 37 శాతం |

పై పట్టికలో రసాయ ఎరువులకు సంబంధించి 1980లో 195 బిలియన్ అమెరికన్ డాలర్ల వాడకం అభివృద్ధి శాతంగా గుర్తించగలరు. దరిమిలా 1980 నాటికి తిండిగింజల స్థాయి 130 మిలియన్ టన్నులకు చేరింది. అదే దామాషా పెరుగుదల నూనె గింజలు, పత్తి, చెరకు వంటి ముఖ్య పంటల్లో కూడా చూడొచ్చు

| హరిత విప్లవ పరిజ్ఞానాల నేపథ్యంలో వివిధ పంటల్లో దిగుబడుల పెరుగుదల ధోరణి (బిలియన్ టన్నుల్లో) | | | | | |
|---|---|---|---|---|---|
| | 1979-80 | 1983-84 | 1987-88 | 1988-89 | 1989-90 |
| వరి | 42.3 | 61.10 | 56.43 | 69.70 | 72.8 |
| గోధుమ | 31.83 | 45.48 | 45.10 | 51.52 | 52.5 |
| పప్పు ధాన్యాలు | 26.97 | 33.90 | 25.84 | 32.33 | 34.0 |
| ముతక ధాన్యం | 8.57 | 12.89 | 11.04 | 15.16 | 13.48 |
| మొత్తం గింజలు | 109.70 | 152.37 | 138.41 | 168.71 | 172.78 |
| నూనె గింజలు | 8.75 | 12.69 | 12.38 | 16.00 | 17.16 |
| పత్తి (మి.బే) | 7.65 | 6.39 | 6.43 | 9.60 | 10.9 |
| చెరకు | 128.83 | 174.08 | 196.72 | 208.0 | 212.0 |

**హరిత విప్లవ సాంకేతిక పరిజ్ఞాన ప్రారంభ స్థితి (1967-68)తో పోలిస్తే, 1985-86 నాటికి వరిలో 1.92, గోధుమలో 3.15, మొత్తం ఆహార ధాన్యాల్లో 2.2, పప్పు ధాన్యాల్లో 0.29 రెట్ల అభివృద్ధిని సాధించాం**

| వివిధ పంటల దిగుబడులు, విస్తీర్ణం, ఉత్పాదకత పెరిగిన స్థాయి (రెట్లు) | | | |
|---|---|---|---|
| | (1967-68 - - 1985-86) | | |
| పంట | విస్తీర్ణం | ఉత్పత్తి | ఉత్పాదకత |
| వరి | 0.65 | 2.54 | 1.92 |
| గోధుమ | 2.41 | 5.64 | 3.15 |
| జొన్న వగైరా | -2.18 | -1.84 | 0.35 |
| ఆహారధాన్యాలు | 0.31 | 2.92 | 2.21 |
| పప్పు ధాన్యాలు | 0.44 | 0.65 | 0.29 |
| మొత్తం తిండి గింజలు | 0.34 | 2.74 | 2.30 |

తొంభయ్యవ దశకంలో కూడా ఆహార ధాన్యాల దిగుబళ్లు 168 మిలియన్ టన్నుల నుండి 202 మిలియన్ టన్నులు, నూనె గింజలు 18.6 మి.ట. నుండి 25.6 మి.ట., పత్తి 9.7 లక్షల బేళ్ల నుంచి 12.2 లక్షల బేళ్లు, చెరకు 254 మిలియన్ టన్నుల నుండి 295 మిలియన్ టన్నులు పెరగడం కూడా గుర్తించాల్సిన ప్రత్యేక అంశమే.

| 1990వ దశకంలో ముఖ్య పంటల దిగుబడుల స్థితి (మి.ట.ల.బే) | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1991-92 | 92-93 | 93-94 | 94-95 | 96-96 | 96-97 | 97-98 | 98-99 |
| ఆ.ధాన్యాలు | 168.0 | 179 | 184.3 | 191.5 | 180.4 | 199.4 | 192.4 | 202.5 |
| నూ.గింజలు | 18.6 | 20.1 | 10.7 | 11.8 | 12.9 | 14.2 | 11.1 | 12.2 |
| పత్తి | 9.7 | 11.4 | 10.7 | 11.8 | 12.9 | 14.2 | 11.2 | 12.2 |
| చెరకు | 254 | 228 | 230 | 275 | 281 | 277 | 266 | 295 |

ఈ హరిత విప్లవ ఒరవడి, విలియంగాడ్, నార్మన్ బోర్లాగ్‌లు అన్నట్లుగా భారత వ్యవసాయ రంగాన్ని ప్రపంచంలో ప్రముఖంగా నిలబెట్టింది. దాదాపు 30-35 సంవత్సరాలు తిండి గింజల దిగుమతుల సహాయంతో ఆహార రంగాన్ని నడపాల్సిన స్థితి నుంచి దేశం ఆహార సమృద్ధతలోకి రావడం వెనుక కేవలం ఆధునాతన సాంకేతిక పరిజ్ఞానాల ప్రతిభవల్లనే అనేది వాస్తవం. ఆ ప్రభావం వల్ల దేశం గోధుమ, వరి, జొన్న ఉత్పత్తుల్లో ప్రపంచ స్థాయిలో రెండోదిగా పత్తి, వేరుశెనగ విషయంలో మూడోదిగా, చెరకు, ఆలుగడ్డ పంటల రీత్యా నాలుగోదిగా, కూరగాయల విషయంలో రెండోదిగా, పండ్ల విషయంలో మూడోదిగా గుర్తింపు పొందింది. అదేవిధంగా పాల ఉత్పత్తిలో ప్రపంచంలోనే అగ్రగామిగా ఉంది. ఈ క్రమంలోనే ఇతర ఆహారాలు - మాంసము, చేపల ఉత్పత్తులు పెరగడం, మనల్ని మిగిలిన రంగాల అభివృద్ధిని కూడా పట్టించుకోనేట్లు చేసింది. హరిత విప్లవంతోపాటు శ్వేత, నీలి, పసుపుపచ్చ విప్లవాలను సాధించినట్లుగా అనుకొన్న దశ అది.

| నూతన మిలీనియం ప్రారంభంలో దిగుబడుల స్థాయి | | | |
|---|---|---|---|
| | 2000-01 | 2001-02 | 2002-03 |
| వరి (మి.ట) | 85.5 | 94.0 | 75.72 |
| గోధుమ (మి.ట) | 68.6/196.2 | 75.7/202.5 | 69.22/183.6 |
| జొన్న (మి.ట.) | 30.4 | 22.4 | 28.41 |
| అపరాలు (మి.ట.) | 11.7 | 10.4 | 10.22 |
| నూనెగింజలు (మి.ట) | 18.7 | 23.6 | 27.00 |
| చెరకు (మి.ట.) | 301.14 | 297.0 | 294.2 |
| పత్తి (లక్షల బేళ్లు) | 11.4 | 8.4 | 10.2 |
| పండ్లు (మి.ట.) | 48.2 | 53.7 | 49.5 |
| కూరగాయలు (మి.ట.) | 88.6 | 93.6 | 90.2 |





# ముగిసిన బతుకులూ ముగియని బాధలూ

- కె. అనురాధ

**ఏ సమాజంలోనైనా రైతులు ఆత్మహత్యలు చేసుకుంటుంటే ఆ సమాజం ఆరోగ్యకరంగా లేదని అర్థం. ప్రస్తుతం ఆంధ్ర రాష్ట్రం రైతు ఆత్మహత్యల సంఖ్యలో తెలంగాణను మించిపోయింది. 'నేషనల్ క్రైమ్ రికార్డ్స్ బ్యూరో' లెక్కల ప్రకారం ఆంధ్రలో 2014లో 632 ఆత్మహత్యలు జరిగితే 2020 చివరికి ఆ సంఖ్య 1214కి పెరిగింది. తెలంగాణలో 2014లో 1347 వున్న సంఖ్య 2020కి 471కి పడిపోయింది. రాష్ట్రానికే అన్నపూర్ణగా ఉన్న గోదావరి జిల్లాల్లో కూడా ఆత్మహత్యలు జరుగుతున్నాయంటే సమస్య తీవ్రతను అర్థం చేసుకోవచ్చు. మూడు దశాబ్దాలుగా రైతు ఆత్మహత్యలు జరుగుతున్నాయి. వాటి సంఖ్య ఏటేటా పెరుగుతోంది. సామాజిక అలజడిని రేపుతున్నాయి. ప్రభుత్వ విధానాలే వాటికి మూలం అని తెలిసినా సరిదిద్దుకునే ప్రయత్నాలేవీ జరగట్లేదు.**

'నాకొడుకు గునపం కోడులాగా వుండేవాడు. అందరికీ తగువులు చెప్పేవాడు' అని తూర్పు గోదావరి జిల్లా కపిలేశ్వరపురం మండలం, నేలటూరు గ్రామంలో గుబ్బల వెంకటేశ్వరరావు తల్లి సత్తెమ్మ తల బాదుకుంటూ ఏడ్చింది. స్వంత భూమి సెంటు లేకపోయినా రెండు పంటలు పండే ఎకరంన్నర భూమిలో కౌలు సేద్యం చేస్తూ కుటుంబాన్ని పోషిస్తున్నాడు వెంకటేశ్వరరావు. కూలికి వెళ్లే బదులు వ్యవసాయం చేసుకుంటే నాలుగు డబ్బులు మిగులుతాయి కదా అని ఆశపడ్డాడు. అతని ఆశతోపాటు అవసరాలు కూడా పెరిగిపోయాయి. పెద్ద కూతురు గుండెజబ్బు, చిన్న కూతురు పురిటి ఖర్చులూ భరించరాని స్థాయికి పెరిగాయి. ఒకపక్క కౌలు 30 బస్తాలు (రెండు పంటలకు) ఇవ్వాలి. మరో పక్క ఎరువులు, మందులు కొన్న దుకాణంలో పెరిగిన బకాయి చెల్లించాలి. పంట పెట్టుబడికి తెచ్చిన రుణమూ తీర్చాలి. తీరా పంట చేతికొచ్చే సమయానికి వర్షాలు ముంచేశాయి. ముందు సంవత్సరం కూడా అదే జరిగింది. చివరికి పంట కలిసిరాక మిగిలింది కొండంత అప్పే. గునపం కోడులాటోడూ విలవిలలాడిపోయాడు. ఎటు పారిపోవ డానికీ దారి తోచలేదు. బతుకు నుంచి బలవంతంగా వెళ్లిపోయాడు. ఇంతకీ వెంకటేశ్వరరావు చావుకి కారణం ఎవరు? అతని 'అత్యాశే' కారణమా? ప్రభుత్వం కౌలు రైతు కార్డులు సరళతరం చేసి, బ్యాంకుల ద్వారా సరళమైన పద్ధతిలో పంట రుణాలిస్తే ప్రైవేటు అప్పుకు వెళ్ళేవాడా? కౌలు రైతు కార్డు వుంటే ఎంతో కొంత పెట్టుబడి రాయితీ, పంట నష్టం రాయితీ పొంది చనిపోయేవాడు కాదేమో? రైతు భరోసా కింద కొంత భరోసా లభించి వుంటే బ్రతికుండేవాడేమో?

తూర్పు గోదావరి జిల్లాలోనే కాట్రేనికోన మండలం, చింతల చెరువులో బడుగు వెంకటేశ్వరరావు కథ కూడా ఇంచు మించు అంతే. మెరుగైన జీవితానికి ఆశపడి కౌలు వ్యవసాయం చేబట్టాడు. కాలవ పక్కభూములు చౌడు వల్ల సరిగ్గా పండక పోయినా, ఎకరానికి 15 బస్తాల కౌలుకు ఒప్పందం చేసుకున్నాడు. వరసగా పంటలు పండక అప్పు పేరుకుపోయి తనువు చాలించాడు. కానీ కథ అంతటితో ముగియలేదు. ఇప్పుడే మొదలైంది. అప్పు భారమంతా వెంకటేశ్వరరావు కొడుకు లోవరాజు తలకు చుట్టుకుంది. లోవరాజు ఇప్పుడు అదే భూమి కౌలుకు చేస్తున్నాడు. అదే షావుకారు మదుపు పెడుతున్నాడు. తండ్రి చేసిన పాత అప్పులకు తోడు కొత్తవి వచ్చి చేరాయి. ఇప్పుడు లోవరాజూ ఆ ఉచ్చులో పూర్తిగా కూరుకుపోయాడు. ఉన్న 20 సెంట్లు అమ్మి కొంత అప్పు తీర్చాడు. కొన్నాళ్ళకు ఇల్లు కూడా మిగులుతుందనే నమ్మకం లేదు. ఇద్దరు వెంకటేశ్వరరావుల కథలు మనకు ఏమి చెబుతున్నాయంటే మెరుగైన జీవితం ఒక కల, ఒక అత్యాశ.

ఏ సమాజంలోనైనా రైతులు ఆత్మహత్యలు చేసుకుంటుంటే ఆ సమాజం ఆరోగ్యకరంగా లేదని అర్థం. అవి ఆ సమాజంలోని లోపాలకీ, దోషాలకీ సూచికలు. ఆ లోపాలను గుర్తించి తొలగించినప్పుడే సమాజం బాగుపడుతుంది. ప్రస్తుతం ఆంధ్ర రాష్ట్రం రైతు ఆత్మహత్యల సంఖ్యలో తెలంగాణను మించిపోయింది. 'నేషనల్ క్రైమ్ రికార్డ్స్ బ్యూరో' లెక్కల ప్రకారం ఆంధ్రలో 2014లో 632 ఆత్మహత్యలు జరిగితే 2020 చివరికి ఆ సంఖ్య 1214కి పెరిగింది. తెలంగాణలో 2014లో 1347 వున్న సంఖ్య 2020కి 471కి పడిపోయింది. రాష్ట్రానికే అన్నపూర్ణగా ఉన్న గోదావరి జిల్లాల్లో కూడా ఆత్మహత్యలు జరుగుతున్నాయంటే సమస్య తీవ్రతను అర్థం చేసుకోవచ్చు. మూడు దశాబ్దాలుగా రైతు ఆత్మహత్యలు జరుగుతున్నాయి. వాటి సంఖ్య ఏటేటా పెరుగుతోంది. సామాజిక

అలజడిని రేపుతున్నాయి. ప్రభుత్వ విధానాలే వాటికి మూలం అని తెలిసినా సరిదిద్దుకునే ప్రయత్నాలేవీ జరగట్లేదు. అడపా దడపా నష్ట పరిహారం ఇచ్చే ప్రభుత్వం ఇప్పుడిక దాన్ని కూడా ఎత్తి పడేసింది. రాష్ట్రంలో కొత్త ప్రభుత్వం వచ్చాక 2021 చివరికి సుమారు 2014 మంది రైతులు చనిపోతే ఇప్పటివరకూ నష్టపరిహారం ఇచ్చింది 450 లోపే. ఉభయ గోదావరి జిల్లాల్లో 87 మంది చనిపోతే కేవలం 28 కుటుంబాలకే నష్టపరిహారం అందింది.

మానవ హక్కుల వేదిక, రైతు స్వరాజ్య వేదిక బృందాలు మార్చి 23 నుండి 25 వరకు ఉభయ గోదావరి జిల్లాల్లో జరిపిన పర్యటనలో ఇటువంటి ఎన్నో ఆందోళన కలిగించే విషయాలు తెలియ వచ్చాయి. మొత్తం నాలుగు డివిజన్లలో 18 రైతు కుటుంబాలను కలిశాము. చనిపోయిన వారందరూ కౌలు రైతులే. ఏటేటా పంటలు నష్టపోయి, అప్పులు పేరుకుపోయి దిక్కుతోచని స్థితిలో ఆత్మహత్య చేసుకుని చనిపోయారు. ప్రభుత్వమూ, మన సమాజమూ ఈ చోద్యాన్ని చూస్తూనే వుండిపోయాయి.

మేము కలిసిన అన్ని కుటుంబాల కథలు దాదాపు ఒకలాగే వున్నాయి. కుటుంబ అవసరాలు మారుతున్నాయంతే. పశ్చిమ గోదావరి జిల్లాలో మేము కలిసిన ఏడు కుటుంబాల్లో ఆరుగురు దళితులూ, ఒక లంబాడా కుటుంబం ఉన్నది. బాధ కలిగించే విషయం ఏమిటంటే చనిపోయిన వారిలో 23 నుండి 28 సంవత్సరాల వయసు కలిగిన వారు ముగ్గురు వున్నారు.

ఆత్మహత్య చేసుకున్న రైతు కుటుంబాల వారి పరిస్థితి చూస్తే జీవితాలను వీళ్ళింకా ఎలా లాక్కొస్తున్నారా అని ఆశ్చర్యం కలుగుతుంది. బహుజన కులాల వారి పరిస్థితి ఇంకా అధ్వాన్నంగా ఉంది. వారికి బహుశా చనిపోయిన మనిషి గురించి ఏడ్చే సమయం కూడా లభించి వుండదు. కొందరైతే భర్త ఉన్నన్నాళ్లు లోకం గురించి తెలియని వారు. ఇప్పుడు భారమంతా మోయాల్సిన పరిస్థితి వచ్చింది. అప్పుల వాళ్ల బెదిరింపుల మధ్య వారు భయంతో వణికిపోతున్నారు. పిల్లలు ఎదిగి చేతికి అందివచ్చిన వారు మినహా అందరూ నానా అగచాట్లు పడుతున్నారు. ఎక్కువ మంది ఉపాధి కూలీ పనికి పోతున్నారు. కొందరు పుట్టింట్లో తలదాచుకున్నారు. ముమ్మిడివరం మండలం, తోట్లపాలెంకు చెందిన శీలం దుర్గారావు భార్య నాగలక్ష్మి అప్పుల వాళ్ల బాధ పడలేక ఊరొదిలి హైదరాబాదులో లిఫ్టు ఆపరేటర్‌గా పని చేస్తోంది. పిల్లల చదువులు అర్థాంతరంగా ఆగిపోయి వాళ్ల భవిష్యత్తు చీకటిమయం అయి పోయింది. ఒకరు ట్రిపుల్ ఐటీ, ఇంకొకరు టెన్త్ చదివేవారు. దాదాపు అన్ని కుటుంబాల్లో పిల్లల చదువులు ఆగిపోయాయి.

**ఆంధ్రరాష్ట్రంలో 2019లో కొత్త ప్రభుత్వం ఏర్పడగానే రైతు ఆత్మహత్యల కుటుంబాలకు నష్టపరిహారం, పునరావాసం నిమిత్తం జీఓ43ను తీసుకొచ్చింది. ఆ జీఓ ప్రకారం ఎక్కడైనా రైతు ఆత్మహత్య జరిగితే వెంటనే మండల తాసిల్దార్, వ్యవసాయ అధికారి, పోలీస్ సబ్‌ఇన్‌స్పెక్టర్ (మండల స్థాయి ధ్రువీకరణ కమిటీ) ఆ కుటుంబాన్ని కలిసి, చనిపోయిన వ్యక్తి రైతు అవునా కాదా, వ్యవసాయంపై అప్పు ఉందా లేదా నిర్ధారించి ఒక్క రోజులో తమ నివేదిక ఇవ్వాలి. ఆ తరువాత ఏడు రోజుల్లోపు ఆర్‌డిఓ, వ్యవసాయ శాఖ సహాయ సంచాలకులు, డిఎస్పి (డివిజనల్ స్థాయి ధ్రువీకరణ కమిటీ) ఆ కుటుంబాన్ని విచారించి ముందుగా చనిపోయినది రైతేనని నిర్ధారించాలి. పట్టా అతని, లేదా ఆమె పేరు మీద లేకపోయినా రైతుగా గుర్తించవచ్చు. అలాగే సాగుదారు కార్డు లేకపోయినా కౌలు రైతుగా నిర్ధారించవచ్చు. అప్పుడు ఆ కమిటీ అది రైతు ఆత్మహత్యగా నిర్ధారించి తమ రిపోర్టును జిల్లా కలెక్టర్‌కు సమర్పించాలి. జిల్లా కలెక్టర్ ఆ రిపోర్టును వ్యవసాయ శాఖ కమిషనర్‌కు పంపితే ఏడు లక్షల రూపాయలు నష్ట పరిహారం భార్య బ్యాంక్ ఖాతాలో జమ అయిపోతుంది.** అలాగే రాష్ట్రంలో 32 లక్షల మంది కౌలు రైతులు ఉంటారని ఒక అంచనా. ప్రతి కౌలు రైతుకు 'క్రాప్ కల్టివేటర్ రైట్స్ కార్డ్' ఇస్తామని వాగ్దానం చేసి 2019లో చట్టం తీసుకొచ్చిందీ ప్రభుత్వం. కానీ ఏ సంవత్సరం కూడా 2 లక్షల కార్డులు మించి ఇవ్వలేదు.

మేము సందర్శించిన 18 కుటుంబాల్లో ఎవరికీ నష్టపరిహారం రాలేదు. సాగుదారు హక్కు పత్రాలు లేవని, మీకు వర్తించదని కుటుంబానికి విఆర్‌ఓలు చెబుతున్నారు. చాలా కుటుంబాలను మండల స్థాయి అధికారులు కలవనే లేదు. విఆర్‌ఓలు, ఆర్‌ఐలు వారికి తోచింది చెప్పి పోతున్నారు. డివిజనల్ స్థాయి ధ్రువీకరణ కమిటీ ఏ ఒక్క కుటుంబాన్నీ కలవలేదు. అమలాపురం మండలం భట్నవిల్లి గ్రామంలో ముంగండ బాబీ అనే దళిత రైతు ఆత్మహత్య చేసుకున్నాడు. అది టౌనుకు 4 కిలోమీటర్ల దూరంలో రోడ్డుపక్క గ్రామం. ఆర్‌డిఓ గారు వాకింగ్‌కు వెళ్ళేటంత దూరమే. అయినా ఆయనికి తీరికలేదు. సాగుదారు కార్డుసహా అన్ని పత్రాలూ సమర్పించి అయిదు నెలలుగా ఆ కుటుంబం ఆయన రాక కోసం ఎదురుచూస్తోంది.

జీఓ 43 అమలు తీరు ఇంత దారుణంగా ఉంటే ఇంక కుటుంబాలకు ఏమి న్యాయం జరుగుతుంది. రెండు మూడు కేసుల్లో గ్రామ రాజకీయాలు అడ్డువచ్చి పరిహారం రాకుండా చేశాయి. చనిపోయిన రైతు ప్రతిపక్ష పార్టీకి దగ్గరవాడైనా, లేదా ప్రతిపక్ష పార్టీ వారు వచ్చి ఆ కుటుంబాన్ని పరామర్శించినా ఆ కుటుంబం ఇంక ఆశలు వదులుకోవాల్సిందే. అంతెందుకు, అధికార పార్టీలో రెండు వర్గాల మధ్య నలిగిపోయి చింతలపూడి మండలం, ఎర్రంపల్లికి చెందిన కోదూరి శ్రీను కుటుంబం నష్టపరిహారానికి దూరమై చాలా దీనావస్థలో వుంది.

ఈ సంక్షోభం ఇంకా ముదరక ముందే ప్రభుత్వం తన కనీస బాధ్యతగా రైతు ఆత్మహత్య కుటుంబాలను వెంటనే ఆదుకోవాలి. నష్టపరిహారం జీఓలో లేని వన్‌టైమ్ సెటిల్మెంట్ అంశాన్ని చేర్చి సవరిస్తే అందిన నష్టపరిహారంలో కొంత సొమ్మును అప్పుల వాళ్లకు చెల్లించగా మిగతాది కుటుంబానికి దక్కుతుంది. కనీసం అప్పులవాళ్ళ సతాయింపు తగ్గే అవకాశం ఉంటుంది. తమది రైతు సంక్షేమ ప్రభుత్వమని చెప్పుకునేవారు చెయ్యాల్సిన కనీస పని ఈ అభాగ్య కుటుంబాలను ఆదుకోవడమే. **(వ్యాస రచయిత మానవ హక్కుల వేదిక విశాఖపట్నం జిల్లా ప్రధాన కార్యదర్శి – ఆంధ్రజ్యోతి సౌజన్యంతో)**

# వెదురు చెట్ల పెంపకం



సంగిరెడ్డి హనుమంత రెడ్డి
సెల్ : 94 90 20 45 45

ఎప్పుడూ ఆకుపచ్చగా ఉండి పుష్పించే వృక్ష సమూహాల్లో వెదురు (బాంబూ) ఒకటి. పోసియే గడ్డి జాతి వృక్ష కుటుంబంలో, బాంబు సోయిడియే ఉపకుటుంబానికి చెందినది. బాంబూ (వెదురు) పదం ఏ భాష నుండి వచ్చిందో కచ్చితంగా తెలియదు. జర్మన్ భాషల్లోని డచ్ నుండి లేదా ఇండో-యూరోపియన్ భాషల్లోని పోర్చుగీస్ నుండి వచ్చిందని ఒక అభిప్రాయం. మలేయ్ లేదా కన్నడ భాష నుండి తీసుకోబడిందని మరొక గట్టి నమ్మకం.

**వెదురు నిర్మాణం :** వెదురు వేర్లు భూమిలో 2 అడుగుల లోతు వుంటాయి. దీని కాండం కణుపుల వద్ద గట్టిగా కణుపుల మధ్యభాగం బోలుగా ఉంటుంది. కాండం పైకి పోనుపోను కూచిగా కాకుండా స్తంభాకారంగా ఉంటుంది. వెదురు అతి వేగంగా పెరిగే మొక్క. కొన్ని రకాల వెదురు గంటకు 40 మిల్లీమీటర్లు (1.5 అంగుళాలు) చొప్పున పెరుగుతుంది. 5 నుండి 10 సెంటి మీటర్ల వ్యాసంతో, 65 నుండి 90 అడుగుల ఎత్తు పెరుగుతుంది. వ్యవసాయానికి అనువుకాని భూముల్లో కూడా వెదురు పెరుగుతుంది. వాతావరణ మార్పులను తట్టుకుంటుంది. అటవీ పునఃపెంపకానికి, మట్టికోతను ఆపడానికి, పేదరికాన్ని తగ్గించడానికి వెదురును పెంచుతారు.

**వెదురు పెరుగుతున్న ప్రాంతాలు :** వెదురుకు తేమతో కూడిన ఉష్ణ మండల సమశీతోష్ణ వాతావరణాలు అనుకూలం. ఉష్ణ మండల ప్రాంతాల నుండి చల్లని పర్వత ప్రాంతాలు, నీరుగల ఎత్తైన అడవుల వరకు విభిన్న వాతావరణాల్లో వెదురు పెరుగుతుంది. తూర్పు-ఆసియా, ఇండియా, హిమాలయాల్లో, చైనా, జపాన్, కొరియా, ఆస్ట్రేలియాల్లో, ఆఫ్రికా, సెనెగల్, మొజాంబిక్, మడగాస్కర్ వగైరా ఉష్ణ మండల ప్రాంతాల్లో వెదురు సాగు ఉంది. దక్షిణ అర్జెంటీనా, మధ్య చిలీలో సముద్రతీర అడవులు, దక్షిణ అమెరికా ఉష్ణ మండల వర్షారణ్యాల్లో, ఈక్వెడార్‌లో ఆండీస్, మధ్య, ఆగ్నేయ అమెరికా, మెక్సికో,దక్షిణ కొరియాలలో వెదురు బాగా పెరుగుతుంది. కెనడా, యూరప్‌లలో స్థానిక వెదురు జాతులు తోట మొక్కలుగా పెరుగుతాయి. ఇటీవల తూర్పు-మధ్య ఆఫ్రికాలో, రువాండాలో వాణిజ్య ప్రాతిపదికన వెదురు సాగు ప్రయత్నాలు జరిగాయి. అమెరికాలో అనేక కంపెనీలు వెదురును వాణిజ్య ప్రాతిపదికన పెంచుతున్నాయి. వెదురు ఉత్పత్తులను వివిధ ప్రాంతాలకు పంపిణీ చేస్తున్నాయి. 1960లలో చైనా, జపాన్ వెదురు జాతులు ప్రచారం పొందాయి. అమెరికా ఇతర దేశాలకు వ్యాపించాయి. వెదురు పెంపకంలో చైనా, ఇండియాలు మొదటి, రెండవ స్థానాల్లో ఉన్నాయి. ఇండియాలో జమ్ము, కశ్మీర్‌లో తప్ప అన్ని ప్రదేశాల్లో, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్, ఒడిశా, ఛత్తీస్‌గఢ్ అటవీ ప్రాంతాల్లో ఎక్కువగా పెరుగుతుంది. వెదురు పొట్టి జాతి "క్లంపింగ్", పొడవాటి "రన్నింగ్" రెండు జాతుల నమూనాల్లో పెరుగుతుంది. క్లంపింగ్ జాతి నెమ్మదిగా అలంకార గడ్డిలా, రన్నింగ్ జాతి వేగంగా పెరుగుతాయి. వెదురు పట్టణమని పేరుబడ్డ చైనాలో అంజి కౌంటిలో వెదురుకు అనుకూలమైన నేల, వాతావరణం ఉన్నాయి. ఉష్ణ మండల వెదురు జాతులు గడ్డకట్టే ఉష్ణోగ్రతల వద్ద చనిపోతాయి. సమశీతోష్ణ వెదురులు -29 డిగ్రీల సెల్సియస్ (-20 డిగ్రీల ఫారిన్ హీట్) కంటే తక్కువ ఉష్ణోగ్రతలను తట్టుకోగలవు. వెదురు కర్బనాలను భూమిలో ఇంకిస్తుంది.

**వెదురు వ్యవసాయం :** వెదురు పుష్పించే చెట్టు. చాలా జాతులు 65-130 ఏళ్ల విరామంతో పూస్తాయి. పుష్పించడం మొదలవగానే చెట్టు శక్తి పూల ఉత్పత్తికి మళ్లించబడుతుంది. చెట్టు క్షీణించి క్రమేపీ చనిపోతుంది. గాలి ద్వారా పుప్పొడి ఫలదీకరించి విత్తనాలు తయారవుతాయి. ఎక్కువ విరామం తర్వాత పుష్పించే చెట్లు ఎక్కువ విత్తనాలను ఉత్పత్తి చేస్తాయి. కొమ్మల చివర్ల పువ్వుల నుండి విత్తనాలు గుత్తులుగా కాస్తాయి. విత్తనాల ఉత్పత్తి సమయం 10 నెలలే వుంటుంది. వెంటనే విత్తనాలను సేకరించి నర్సరీలలో మొలకెత్తించాలి. విత్తనాలు మొలకెత్తే దశలో మొక్కలపై ఎండపడరాదు. నాటిన విత్తనాలపై చెత్త, గడ్డి, ఆకులు కప్పాలి. 8 నుండి 12 నెల్లకు మొక్కలు 5 సెంటీమీటర్లు పెరుగుతాయి. అప్పుడు జాగ్రత్తగా పెకలించి ప్లాస్టిక్ సంచుల్లో నర్సరీలకు తరలించాలి. కొన్నిసార్లు విత్తనాలు చెట్ల కిందపడి మొలకెత్తుతాయి. ఈ మొక్కలను కావలసిన చోట తిరిగి నాటుకోవచ్చు.

నాటిన 3 వారాల పాటు నీళ్ళు బాగా పెట్టాలి. మరో పద్ధతిలో ఆరోగ్యకరమైన చెట్ల నుండి 1, 2 ఏళ్ల పచ్చని చెట్లను ఎంపికచేసుకోవాలి. భూమి నుండి 4, 5 కణుపుల పైన కాండాన్ని కత్తిరించాలి. ఆకులు, రెమ్మలను తొలగించాలి. మొదటి కణుపు నుండి కొత్త మొక్కలు పుడతాయి. వీటిని నారు మొక్కలుగా వాడవచ్చు. 60 సెంటీమీటర్ల గుంటల్లో లేదా కుండీల్లో నాటి నీళ్ళు పోయాలి. వెదురుకు నీటి సౌకర్యం బాగా ఉండాలి. మొక్కల దశలో కలుపు తరచుగా తీయాలి. అవసరమైతే సెంట్ 7 లాంటి కలుపు మందులను ఎకరానికి 2.5 లీటర్ల చొప్పున గడ్డి మోతాదును బట్టి ఏడాదికి 4, 5 సార్లు కొట్టాలి. నర్సరీలో చీమలు, చెదలు బెడద తప్ప వెదురు చెట్లకు ఎలాంటి రోగాలు రావు. చిన్న మొక్కల వేర్లను, రెమ్మలను ఎలుకలు తినే అవకాశం ఉంది. దీనికి స్థానిక పద్ధతుల్లో చర్యలు తీసుకోవాలి. పెద్ద వెదురు తోటల పెంపకానికి నర్సరీలో పెంచిన వెదురు మొక్కలు నాటడమే అనుకూలం. తక్కువ ఎత్తున్న మొక్కలకు వేర్లు ఎక్కువ వుంటాయి. ఎక్కువ వేర్లున్న మొక్కలు బాగా పెరుగుతాయి. 50 సెంటీమీటర్ల ఎత్తు నర్సరీ మొక్కలు వెదురు తోటల్లో నాటడానికి అనుకూలం. నర్సరీలో బాగా నీరుపెట్టి తోటల్లో నాటడానికి తరలించాలి.

వెదురు అన్ని నేలల్లో పెరుగుతుంది. సారవంతమైన, గరుగు తడి నేలలు శ్రేయస్కరం. వరద భూములు పనికిరావు. ఒక మోస్తరు ఏటవాలు నేలలు అనుకూలం. గడ్డి, మొక్కలు లేకుండా భూమిని చదునుచేయాలి. చెట్లకు మధ్య 5 × 4 మీటర్ల దూరం ఉండాలి. ఎకరానికి 200 చెట్లను నాటవచ్చు. అంతర పంటలు పండించడానికి, వెదురు చెట్ల, అంతర పంటల నిర్వహణకు, కోతలకు ఈ దూరం అవసరం. బాగా ఎండ తగిలేటట్లు ఉత్తర దక్షిణ దిశలో గుంటలు తీయాలి. గుంటలు 1 మీటరు వ్యాసం 60 సెంటీమీటర్ల లోతు వుండాలి. మొక్కలు నాటడానికి రెండు వారాలు ముందు ఈ పనులు పూర్తిచేయాలి. వర్షాకాలం ముందు వెదురు మొక్కలను గుంటల్లో నాటాలి. తవ్విన మట్టితో సేంద్రీయ ఎరువు లేదా పశువుల పేడ కలిపి గుంటలను పూడవాలి. అవసరమైతే ఈ మిశ్రమంలో చెదలు నిరోధక మందును కలపవచ్చు. ఒకటి రెండు మొక్కలు చనిపోతే వాటి స్థానంలో వెంటనే కొత్త మొక్కలు నాటాలి. మొదటి ఏడాది 6 నెల్లకు ఒకసారి మొక్క చుట్టూ నేలను గుల్ల బార్చాలి. దీనితో మొక్క బాగా నీటిని పీల్చుకుంటుంది. మొక్క చుట్టూ 60 సెంటీమీటర్ల వ్యాసార్థంలో కలుపు లేకుండా నేలను శుభ్రంగా ఉంచాలి. ఇందులో ఆకులు, సేంద్రీయ పదార్థాలు వేస్తే తడి ఆరదు. గడ్డి పెరగదు. చెట్లకు భూసారం లభిస్తుంది. మొక్కలు కుళ్లినా, చనిపోయినా వాటిని పెకలించి వేయాలి. ఏదైనా చీడ సోకిందేమో తెలుసుకొని తగిన చర్యలు తీసుకోవాలి. మూడేళ్ల వరకు వాణిజ్య పంటలు, కూరగాయలు అంతరపంటలుగా పండించవచ్చు. ఇవి అదనపు ఆదాయాన్ని ఇస్తాయి. గడ్డి, కీటకాలను అరికడతాయి. నేలకోతను ఆపి భూమిని గట్టిపరుస్తాయి. మూడేళ్ళ తర్వాత అంతరపంటగా పెసర, పిల్లిపెసర పండించవచ్చు.

**చెట్ల కోత :** వెదురు ముదిరి బలంగా తయారైనపుడు వెంటనే కోయాలి. లేకంటే తెగులు సోకుతుంది. 3 నెల్లకు పూర్తి ఎత్తు పెరిగి, కొమ్మలు, ఆకులు పెరుగుతాయి. ఏడాదికి పూర్తిగా ఎదుగుతాయి. 3 నుండి 5 ఏళ్ళకు వెదురు చెట్లు ముదురుతాయి. ప్రతి ఏడాది ముదురు బొంగులను నరికివేస్తుండగా కొత్త రెమ్మలు పెరుగుతాయి. 10-15 ఏళ్ళుదిగుబడి ఇస్తుంది. కాండాలనుభూమికి 15, 30 సెంటీమీటర్ల ఎత్తుకు పైన లేదా మొదటి కణుపు పైభాగానికి కత్తిరించాలి. ఇది మిగిలిన కాండం నీటిలో కుళ్లిపోకుండా చేస్తుంది. వెదురు చెట్లను వేసవిలోనే కత్తిరించాలి. కత్తిరించిన బొంగులను ఎండబెట్టాలి. బొంగులను నిలువుగా చీల్చి గాలిలో ఆరబెట్టడం మంచిది. ఆరుతున్నపుడు బొంగుల మొదళ్ళు, చివర్లను ఒకటి అటు ఒకట ఇటు తిరగతిప్పి కట్టలుకడితే వంకర పోకుండా ఉంటాయి. ఆరిన వెదురు బొంగులకు బొరాక్స్ లేదా కొయ్యను నిలువ ఉంచే రసాయనాలను పూయాలి. కోసిన వెదుర్లను తోటలోనే కొంతకాలం వదిలేస్తారు. లేదా కావలసిన పొడవు ముక్కలుగా కోసి పొగపెడతారు. ఇది తడిని తగ్గించి బొంగులను గట్టిపరుస్తుంది. పొగతో ఆరబెట్టిన బొంగులు 15 ఏళ్ల వరకు నిలువ ఉంటాయి. కోసిన చివర్లకు లేదా మొత్తం బొంగులకు తడిసున్నం పూయాలి. ఇది తడి తగలకుండా, కాండాలకు బూజు పట్టకుండా చేస్తుంది. కొన్ని పద్ధతుల్లో కోసిన చెట్లను ముక్కలు చేసి చెడిపోకుండా చేసే పదార్థాలు కలిపిన నీటి తొట్లలో కొన్ని రోజులు ఉంచుతారు. కోసిన చివర్లను నూనెలో కాని, తీసేసిన ఇంజిన్ ఆయిల్‌లో కాని ముంచుతారు.

**కణద్రవ సేకరణ (లీచింగ్) :** కోత తర్వాత రసాన్ని తొలగించడాన్ని లీచింగ్ అంటారు. వెదురు కణద్రవ స్థాయి కోత తర్వాత ఎండకు తగ్గిపోతుంది. కోసిన వెదురు కాండాలను నేల నుండి పూర్తిగా లేవదీసి ఒకటి, రెండు వారాల పాటు, ఆకులు పసుపు రంగులోకి మారే వరకు నిలబెడతారు. లేదా వెదురు కాండాలను పెద్ద డ్రమ్ములో లేదా నీటి ప్రవాహంలో నిలబెట్టి ఉంచుతారు. కోసిన కాండాలు 3,4 వారాల పాటు పారుతున్న నీటిలో మునిగి బరువు తగ్గుతాయి. కోసిన కాండాలకు వేగంగా నీళ్ళు కొడతారు. నీరు పోయే ప్రక్రియలో, వెదురు


కణద్రవ సేకరణ (లీచింగ్)

పగలకుండా వెదురును నెమ్మదిగా, సమానంగా నీడలో ఆరబెడతారు. దీనితో తెగులు సోకే అవకాశాలు తగ్గుతాయి.

**ఉపయోగాలు :** వెదురును భవన నిర్మాణ సామగ్రిగా, ఫ్లోరింగ్‌కు, ఆహార పదార్థాల వనరుగా, చేతి వృత్తుల వస్తువుల, బుట్టలు, తడికెలు, ఇంటి వస్తువుల, వ్యవసాయ పనిముట్ల, కళాఖండాల తయారీలో, కాగితం చేయడానికి వాడతారు. ఇది చెక్కకు బదులుగా ఉపయోగ పడుతుంది. మెత్తగా ఉన్నా గట్టి చెక్కతో సమానం. మెత్తటి వెదురు రెమ్మలు, కాండం, ఆకులు, పులియబెట్టిన రసం (నీరా) చైనా ఎలుగుబంట్లకు, నేపాల్ పాండాలకు, మడగాస్కర్ లెముర్లకు(పాలిచ్చే ఎలుకలవంటి జంతువులు) ముఖ్య ఆహారం. ఎలుకలు, ఆఫ్రికా గొరిల్లాలు, చింపాజీలు, ఏనుగులు వెదురు పండ్లను, కాండాలను తింటాయి. లావోస్, మయన్మార్, థాయిలాండ్, చైనాలలో పురుగులు వెదురు గుజ్జును తింటాయి. వెదురు రెమ్మలను ఆసియా వంటకాలు, పులుసులలో ఉపయోగిస్తారు. వెదురు చిగురును వంటల్లో మసాలా దినుసుగా వాడుతారు. అస్సాంలో దీన్ని ఖోరిసా అంటారు. నేపాల్‌లో వెదురు రెమ్మలను పసుపు, నూనె, బంగాళాదుంపలతో కలిపి వండి అన్నంలో కలిపి తింటారు. దీన్ని ఆలుతామా అంటారు. ఇండొనేషియాలో వెదురు రెమ్మలను ముక్కలుచేసి, కొబ్బరిపాలు (సాంటాన్), సుగంధ ద్రవ్యాలతో ఉడకబెట్టి గులైరెబంగ్ అనే వంట చేస్తారు. వెదురు రెమ్మలతో సయుర్ లోదే (కొబ్బరి పాలలో కూరగాయలు కలిపి), లంపియా (కూరగాయలతో వేయించిన వెదురు రెమ్మలు) చేస్తారు. ఊరగాయల్లో వెదురును మసాలాగా ఉప యోగిస్తారు. లేత వెదురు రసాన్ని పులియబెట్టి ఉలంజి (తీపి సారా) లేదా శీతల పానీయం చేస్తారు. ఊరేసిన వెదురు రెమ్మలను బీన్స్‌తో కలిపి నేపాల్‌లో రుచికర వంట వండుతారు. ప్రపంచవ్యాప్తంగా నేపాలీ రెస్టారెంట్లు ఈ వంటకాన్ని ఆలూ బోడి తామాగా వడ్డిస్తాయి. వెదురు రెమ్మలను ముక్కలు చేసి, ఆవాలు, పసుపుతో కలిపి ఊరగాయలు చేస్తారు. వెదురు రెమ్మలను కూరగా వండుతారు. ఇండియాలో సంబల్పూర్‌లో లేతరెమ్మలను తురిమి పులియబెట్టి కర్డీ అనే పదార్థాన్ని చేస్తారు. దీన్ని పలు రకాల వంటల్లో వాడుతారు. పుల్లని కూరగాయలతో కలిపి అమిల్ అనే పానీయం, బియ్యపు పిండితో కలిపి రొట్టెలు చేస్తారు. పీచు రెమ్మలను ఎండబెట్టి, ఇసుక-పరిమాణ రేణువులుగా మెత్తగా చేసి హెందువా అన్న అలంకరణ వస్తువును చేస్తారు. గుమ్మడికాయ ఆకులతో కలిపి వండుతారు. కొంకణి వంటకాలలో, లేత రెమ్మలను తురిమి, పనస గింజల పొడి కలిపి కిర్ల సుక్కేవండుతారు. వెదురు కాండాల బోలులోఉంచి అనేక రకాల ఆసియా సంస్కృతుల ఆహారాన్ని వండుతారు. బోలులో సూప్, బియ్యం పోసి అన్నం వండుతారు. టీ తయారు చేస్తారు. వెదురుతో అనేక సంస్కృతుల వంట పాత్రలు, గరిటెలు, తెడ్లను చేస్తారు. వెదురు పనిముట్లు, పాత్రలను పర్యావరణ అనుకూల ప్రత్యామ్నాయంగా చూస్తారు. సిక్కిం రాష్ట్రం ప్లాస్టిక్ సీసాలకు బదులు వెదురు నీటి సీసాలను ప్రచారం చేసింది. ఎండిన వెదురు, చెత్త నుండి తయారుచేసిన బొగ్గు 600-1200 సెల్సియస్ డిగ్రీల ఉష్ణోగ్రతను ఇస్తుంది. వెదురు బొగ్గుకు సుదీర్ఘ చైనీస్ చరిత్ర ఉంది. చుజౌలోని మింగ్ రాజవంశం కాలంలో, 1486 నాటి పత్రాలలో, క్వింగ్ రాజవంశం కాలంలో, కాంగ్సి, కీయాన్ లాంగ్, గ్వాంగ్సు చక్రవర్తుల పాలనలో ఈ బొగ్గు ప్రస్తావన ఉంది.

వెదురు పీచుతో నూలు, దుస్తులు తయారు చేస్తారు. తివాచీలు నేస్తారు. వెదురు పీచును విస్తృత శ్రేణి వస్త్ర, ఫ్యాషన్ అనువర్తనాలకు ఉపయోగిస్తున్నారు. చొక్కాలు, ప్యాంటులు, మేజోళ్లు, షీట్లు, దిండు కవర్లు, పరుపులు చేస్తారు. వెదురు నూలును జనపనార, గోగునారల వస్త్ర పీచులు, నూలులతో కలపవచ్చు. వెదురు ప్లాస్టిక్‌కు ప్రత్యామ్నాయం, పునరుత్పాదకమైనది. విస్కోస్ రేయాన్ వెదురు నుండి తయారైన ఆధునిక దుస్తులు. వెదురు సెల్యులోజ్‌ను కరిగించి, బయటకు తీసి పీచు, నూలు తయారు చేస్తారు.

చైనా, ఇండియాలలో క్రీ.పూ.3వ శతాబ్దం నాటికే వెదురుతో వేళ్లాడే వంతెనలు నిర్మించారు. క్రీ.శ.960 రచనల్లో కియాన్-జియాన్ ప్రాంతంలో ఆ వంతెన ప్రస్తావించబడింది. చైనాలో 6 అంతస్తుల వరకు వెదురును వాడతారు. ఇప్పటికీ హాంకాంగ్‌లో ఆకాశహర్మ్యాల్లో వాడుతారు. ఫిలిప్పీన్స్‌లో వెదురును ఇళ్ల నిర్మాణంలో గోడలు, పలకలు, స్తంభాలు, పైకప్పులకు ఉపయోగిస్తారు. జపాన్ వెదురు నాణ్యమైనది. దాన్ని కలప, గట్టర్లు, కంచెలు, భవనాల అలంకరణ పరికారాలుగా ఉపయోగిస్తారు. బంగ్లాదేశ్‌లో వెదురుతో వంతెనలు నిర్మిస్తారు. వాటిని 'సాకో' అని పిలుస్తారు. చైనీస్ వెదురు ఫర్నిచర్ సహస్రాబ్దాల సంప్రదాయ ప్రత్యేక శైలి. వెదురుతో సైకిళ్ళు, సర్ఫ్ బోర్డులు, స్నో బోర్డులు, స్కేట్ బోర్డ్‌లను, చేపలు పట్టే కడ్డీలను తయారు చేస్తారు. వెదురు ఫిరంగి అనే పటాకులు చేస్తారు. సముద్రపు నీటి నుండి ఉప్పును తీసివేయడానికి వెదురు వడపోత ఉపయోగించబడుతుంది. ఆసియా మారుమూల ప్రాంతాల అనేక జాతుల ప్రజలు తెప్పలను చేయడానికి వెదురును ఉపయోగిస్తారు. వెదురు కాడలతో నీటిలో తేలియాడే ఇళ్లను నిర్మిస్తారు.

పురాతన కాలంలో, భారత ప్రజలు సన్నని వెదురు కర్రలతో 5-10 మిల్లీమీటర్ల వ్యాసం,100-150 మి.మీ. పొడవు పెన్నులను చేసేవారు. చైనాలో క్రీ.పూ. 5వ శతాబ్దం నుండి వెదురు రాత పత్రాల మాధ్యమంగా వాడుకలో ఉంది. ఇతర మాధ్యమాల్లో క్రీ.పూ.1250 నుండి వాడుకలో ఉందని ప్రాచీన గ్రంథాలు స్పష్టం చేశాయి. హాన్ రాజవంశ కాలంలో వెదురు, చెక్క రచనా సామగ్రిగా వుపయోగించబడ్డాయి. చైనాలో తొలినాళ్ల నుంచి వెదురును కాగితం తయారీకి వాడారు. చేతితో చేసిన వెదురు కాగితం ఇప్పటికీ నాణ్యతతోఉత్పత్తి అవుతోంది. చైనా, మయన్మార్, థాయిలాండ్, ఇండియాలలో వెదురు గుజ్జు చేస్తారు. దీన్ని అచ్చుకు, రాతపత్రాల్లో ఉపయోగిస్తారు. మహారాష్ట్ర పేపర్ మిల్లులు కాగితం ఉత్పత్తికి వెదురును ఉపయోగిస్తాయి. వెదురు నుండి కరిగే గుజ్జు తయారు చేస్తారు.

వెదురు బరువు తక్కువ. ఆయుధాల నిర్మాణానికి ఉపయోగించబడింది. ఇప్పటికీ ఆసియా యుద్ధకళల్లో చేర్చబడింది. ఒక చివర పదును పెట్టబడిన వెదురు కర్రలను తమిళ యుద్ధకళ సిలంబం(కొండ

వెదురు)లో వాడుతున్నారు. భారత యుద్ధకళ గట్కాలో కొయ్యలు వెదురువే. జపనీస్ యుద్ధకళ కెండో లోషినాయి అనే వెదురు కత్తిని ఉపయోగిస్తారు. క్యుడో లో వాడేయుమి విల్లులు, బాణాలను వెదురుతో చేస్తారు. తుపాకి పేలుడు పొడి ఆయుధాలు వెదురుతో చేయబడ్డాయి. ఫిలిప్పైన్స్ భూ నావికాదళ యుద్ధాల్లో వాడిపారేసే క్షిపణులుగా బగాకే అనే వెదురు ఈటెలను వాడారు. సుగొబ్ అనే బరువు గోళాలను వెదురుతో చేశారు. ఫిలిప్పైన్స్, బోర్నియో, సులవేసి దీవుల్లో వాడే సంపిట్ అనబడే గుండ్లను, మందపాటి చిన్న బాణాలను బోలు వెదురుతో చేస్తారు.

వేణువులు, మౌత్ ఆర్గన్లు, సాక్సోఫోన్లు, ట్రంపెట్‌లు, డ్రమ్స్, జిలోఫోన్లసహా అనేక రకాల వాయిద్యాలను వెదురుతో రూపొందిస్తారు. పాలినేషియాలోసాంప్రదాయ హులాకోసం వాడే వాయిద్యాలు వెదురుతో చేయబడ్డాయి. ఇండోనేషియా, ఫిలిప్పైన్స్, కోలింటాంగ్, ఆంగ్ లుంగ్, బంబోంగ్‌లతో సహా వివిధ రకాల వాయిద్యాలను, స్లిట్ డ్రమ్స్‌ను వెదురుతో చేస్తారు. సాంప్రదాయ ఫిలిప్పైన్ బండ కవాన్, మారింబా, ఆంగ్‌క్ లంగ్, పాన్ పైప్స్, బంబోంగ్, క్లారినెట్లు, సాక్స్ ఫోన్లు, ట్యూబాస్ వంటి పశ్చిమ వాయిద్యాలసహా పలు రకాల వాయిద్యాల తయారీకి వెదురును ఉపయోగిస్తాయి. ఆధునిక యాంప్లిఫైడ్ స్ట్రింగ్ ఇన్‌స్ట్రుమెంట్ చాపమన్ స్టిక్ వెదురుతో నిర్మించ బడింది. హిందు మహాసముద్ర ద్వీపమైన మడగాస్కర్‌లో, ఒకే వెదురు కొమ్మతో చేయబడిన వాలిహా అనే పొడవైన గొట్టం జితార్ జాతీయ పరికరం. గిటార్, ఉకులేల్స్ తయారీకి కూడా వెదురును వాడతారు.

1997లో వెదురు పెంపకాన్ని ప్రోత్సహించడానికి ఒక అంతర్జాతీయ అంతర్ ప్రభుత్వ సంస్థ, 'అంతర్జాతీయ వెదురు, పేము సంస్థ'ను స్థాపించింది. 2009లో, ఐక్యరాజ్య సమితి పారిశ్రామికాభి వృద్ధి సంస్థ కెన్యా, ఇథియోపియాలలో పాక్షిక-శుష్క వాతావరణాల్లో వెదురు పెంపకం కోసం మార్గదర్శకాలను ప్రచురించింది. ఇటీవల ఆసియాలో వెదురు పరిశ్రమ గణనీయంగా అభివృద్ధి చెందింది. 2016కి అమెరికా ఫైబర్ కార్పొరేషన్, అమెరికాలో వెదురు పెంపకం కోసం రైతులతో ఒప్పందం కుదుర్చుకుంది. 2019లో వెదురు ప్రపంచ వ్యాప్తంగా రూ. 5.5 లక్షల కోట్ల ముడి పదార్థాలను అందించింది. నేడు ప్రపంచవ్యాపితంగా 4.5 లక్షల కోట్ల వెదురు పరిశ్రమ ఉంది. 60 కోట్ల ప్రపంచ ప్రజలు వెదురు నుండి ఆదాయం పొందుతున్నారు.



వెదురు నూలు, సింథటిక్ రిబ్బన్‌లతో చేసిన కండువా , రన్నింగ్ వెదురు



పుష్పిస్తున్న వెదురు చెట్టు　　వెదురు విత్తనాలు

చైనా వెదురు రంగం 2.25 లక్షల కోట్ల వార్షిక వాణిజ్యంతో కోటి మందికి ఉపాధి కల్పించింది. ఉపాధి కల్పనలో అమెరికా రెండవ స్థానంలో ఉంది. ప్రపంచంలో 8 కోట్ల ఎకరాల్లో వెదురు పెరుగుతోంది. ఇది గ్రామీణాభివృద్ధికి, పర్యావరణ రక్షణకు, భూ తాప నియంత్రణకు ఉపయోగపడుతోంది. వేసవిలో 8 డిగ్రీల వరకు వాతావరణాన్ని చల్లబరుస్తుంది. వెదురు మామూలు చెట్టు కంటే 2 నుండి 6 రెట్లు ఎక్కువ కార్బన్ డయాక్సైడ్‌ను గ్రహిస్తుంది. సగటున ఒక వెదురు చెట్టు ఏడాదికి 400 కిలోల బొగ్గు పులుసు వాయువును పీల్చుకుంటుంది. కార్బన్‌ను తగ్గించటానికి ఇన్ఫోసిస్ కంపెని బెంగళూరులో 30 ఎకరాల్లో వెదురు పెంచింది. ఎకరం పొలంలో వెదురు ఏడాదికి 62 టన్నుల ఆక్సిజన్ ఉత్పత్తి చేస్తుంది. 88 టన్నుల కార్బన్ డయాక్సైడ్‌ను పీల్చుతుంది. వెదురు విద్యుత్తు ఉత్పత్తికి వాడబడుతోంది. వెదురు చెట్లు భూ కంపాలను నివారిస్తాయి. ఐరోపా, ఉత్తర అమెరికా దేశాల్లో జీవవైవిధ్య వినాశం, అధిక భూ ఆక్రమణ వెదురు నష్టాలుగా పరిగణిస్తారు. అయితే అనేక వైవిధ్య లక్షణాలతో 1600 రకాల వెదురు జాతులు ఉన్నాయి. ఆయా ప్రాంతాల వాతావరణ పరిస్థితులను బట్టి హానికరంకాని వెదురు జాతిని ఎంచుకోవచ్చు.



క్లంపింగ్ వెదురు

| వెదురు ఆదాయ వ్యయ లాభాలు : ఒక ఎకరంలో వెదురు సాగు ఆదాయం, ఖర్చు, లాభాల నమూనా | | | |
|---|---|---|---|
| అంశం | ఖర్చు వివరాలు | ప్రారంభఖర్చు (రూ.ల్లో) | 5 నుండి ప్రతియేటి ఖర్చు |
| 1. మొక్కలు | 200 మొక్కలు × రూ.100 | 20,000 - | ... |
| 2. ఎరువులు | 200మొక్కలు × 10కిలోలు×రూ.2.5 లు | 5,000 | 5,000 |
| 3. రసాయనఎరువు | 200మొక్కలు × 7.2 కిలోలు× రూ.22 | 31,680 | 31,680 |
| 4. బిందుసేద్యం పరికరాలు | రూ.35,000 నుండి రూ.55,000 | 50,000 | ... |
| 5. పురుగు మందులు | - | 10,000 | 5,000 |
| 6. కంచె | - | 30,000 | ... |
| 7. కూలీలు | మొత్తం 63 కూలీలు ×రూ.200 | 12,600 | 12,600 |
| 8. సేద్యం | 5 కూలీలు ×200×20 సాగులు | 20,000 | ... |
| 9. కోతలు | - | - | 5,000 |
| 10. మొత్తం ఖర్చు | - | 1,79,280 | 59,280 |

**గమనిక :** మొక్కల ధరల, ఎరువుల, పురుగు మందుల, బిందు సేద్య పరికరాల, సాగు ఖర్చులు మారుతాయి. విద్యుత్తు, రవాణా, షెడ్డు ఖర్చులు లెక్కించలేదు. రసాయనిక ఎరువులు, కంచె అవసరం లేకపోవచ్చు.

ఒక వెదురు బొంగు సగటు బరువు 15, 20 కిలోలు ఉంటుంది. ఎకరానికి 200 చెట్లున్న వెదురు తోట 13.5 టన్నుల ఐదేళ్ళ వయసు వెదురును ఉత్పత్తి చేస్తుంది. సగటు బొంగు ధర రూ.100. బొంగుల నాణ్యత, ప్రదేశాలను బట్టి ధర పెరగవచ్చు. ఎకరంలో, 20 చెట్లు చనిపోతాయనుకుంటే,180 చెట్లు, చెట్టుకు సగటున 5 బొంగుల చొప్పున 900 కర్రలు పెరుగుతాయి. ఈ లెక్కన 900× రూ.100=రూ.90,000 రాబడి వస్తుంది. ఎకరానికి ఖర్చు రూ.59,280 పోను (రూ.90,000 - రూ.59,280) నికర లాభం రూ. 30,720. చెట్ల మధ్య దూరం 5×4 మీటర్లు అయితే ఎకరాకు 200 చెట్లు వస్తాయి. చెట్ల మధ్య దూరం1.25×1.25 మీటరు అయితే ఎకరాకు 2,564 వస్తాయి. తర్వాతి సంవత్సరాలలో చెట్టుకు 7 బొంగులు పుడతాయి. అప్పుడు 180 చెట్లు×7 బొంగులు=1260 బొంగుల మీద ఆదాయం రూ.1,26,000., నికర లాభం రూ.66,720లకు పెరుగుతుంది. చెట్ల మధ్య దూరం తగ్గినా, బతికే చెట్ల సంఖ్య పెరిగినా ఎకరానికి చెట్ల సంఖ్య పెరుగుతుంది. ఆ మేరకు ఆదాయం, నికర లాభమూ పెరుగుతాయి. 5 ఏళ్ళ కంటే ముందే 3 ఏళ్లకే వెదురును నరికి ఉపయోగించవచ్చు. 10, 15 ఏళ్ల పాటు ప్రతి ఏడాది బొంగులను నరికి వేస్తుంటే మరలా కొత్త కాండాలు పెరుగుతూనే ఉంటాయి. ఆదాయం వస్తూనే ఉంటుంది. బీమా వెదురు ఎకరానికి ఏడాదికి 50 టన్నుల చొప్పున 100 సంవత్సరాలు దిగుబడి ఇస్తుంది. 2014లో నాగాలాండ్‌లో వెదురుతో నికర వార్షిక ఆదాయం రూ.1,75,948గా నమోదయింది. ఎకరాకు 500 చెట్లతో చెట్టుకు 60 చొప్పున 30 వేల బొంగులతో బొంగుకు రూ.50లతో రూ.15 లక్షల ఆదాయం వస్తుందని, రూ.5,84,000 ఖర్చు పోను 5 ఏళ్ల తర్వాత రూ.9.16 లక్షల నికర వార్షిక లాభం వస్తుందని నేషనల్ బాంబూ మిషన్ లెక్క గట్టింది.

**మొక్కలు - మార్కెటింగ్ :** మన రాష్ట్రంలో పలుచోట్ల వెదురు మొక్కలు లభిస్తాయి. జాతులను బట్టి మొక్క రూ. 20, 80, 100, 400లకు అమ్ముతారు. అంతర్జాల మార్కెట్‌లో, అమెజాన్‌లో వెతికి అనుకూలమైన మొక్కలు, విత్తనాలను పొందవచ్చు. మన దేశంలో ఇప్పుడు 2.6 కోట్ల మెట్రిక్ టన్నుల వెదురు అవసరం ఉంది. సమీప భవిష్యత్తులో ఈ డిమాండ్ పెరిగే అవకాశాలు ఉన్నాయి. ఈ అవసరాలను తీర్చటానికి, వెదురు పెంపకాలను ప్రోత్సహించటానికి భారత ప్రభుత్వం వ్యవసాయ శాఖ ఆధ్వర్యంలో నేషనల్ బాంబూ మిషన్ ఏర్పాటు చేసింది. రైతులకు సాంకేతిక సహాయాన్ని అందించటానికి శాస్త్ర, సాంకేతిక శాఖ నేషనల్ మిషన్ ఆన్ బాంబూ అప్లికేషన్‌ను స్థాపించింది. వెదురు పరిశ్రమ సుస్థిర అభివృద్ధికి, ప్రజలకు, ప్రత్యేకించి ఈశాన్య రాష్ట్రాలలో, జీవనాన్ని కల్పించటానికి పేము, వెదురు సాంకేతిక కేంద్రం (కేన్ అండ్ బాంబూ టెక్నలాజికల్ సెంటర్) ప్రణాళికలు రచించింది. ఇవి వెదురు సాగులో, అధికాదాయాలు పొందటంలో గ్రామీణ ప్రజలకు సహాయ, సహకారాలు అందిస్తాయి. ఝార్ఖండ్, రాంచి జిల్లా కనకే పట్టణంలోని బిర్సా అగ్రికల్చరల్ యూనివర్సిటీ వాణిజ్య స్థాయిలో వెదురు సాగు చేయటానికి రైతులకు శిక్షణ ఇస్తోంది. వెదురు అభివృద్ధి విధానాల కింద నాబార్డ్ అప్పులు, సబ్సిడీలు ఇస్తోంది. వెదురును ప్రత్యక్షంగా ప్రజలకు అమ్మవచ్చు. వెదురుతో వస్తువులు చేసి, చేయించి అమ్మవచ్చు, అమ్మించవచ్చు. ప్రకృతి సుందరీకరణ వ్యాపారులకు, వాణిజ్య స్థాయిలో తోటలు, వనాలు పెంచేవారికి వెదురును అమ్మవచ్చు. రైతుల దగ్గర వెదురును కొనే వ్యాపారస్తులు చాలా మంది ఉన్నారు.

**ముగింపు :** మనుషుల, పశుపక్ష్యాదుల సమస్యలకు వెదురు పరిష్కారం చూపుతోంది. సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక ప్రయోజనాలు కలిగిస్తోంది. కోట్లాది జనం వెదురు ఇళ్ళలో నివసిస్తున్నారు. గ్రామీణ పేదల్లో అధిక జనాభా గూటికి, కూటికి వెదురు మీద ఆధారపడి ఉన్నారు. రైతులు పెద్ద ఎత్తున వెదురు చెట్లను పెంచాలి. ఇందులో వారి ఆర్థిక లాభాలతో పాటు దేశ ప్రగతి కూడా ఉంది. వెదురు పెంపకానికి బ్యాంకులు, సహకార సంస్థల నుండి అప్పు, రాయితీలు లభిస్తాయి.

(వ్యాస రచయిత : ఆల్ ఇండియా ప్రోగ్రెసివ్ ఫోరం జాతీయ కార్యదర్శి)

# పెరటి కోళ్లలో కడక్‌నాథ్ జాతి భారతీయ ప్రసిద్ధి







డాక్టరు జి.రాంబాబు,
పశు వైద్య సహాయ
శస్త్ర చికిత్సకులు, కడప

వ్యవసాయ అనుబంధ రంగాల్లో పెరటికోళ్ల పెంపకం అత్యంత లాభదాయకంగా ఉంటోంది. గ్రామాల్లో చిన్న, సన్నకారు రైతులతోపాటు భూమిలేని వ్యవసాయ కూలీలు పెరటి కోళ్ల పెంపకాన్ని చేపట్టి లాభాలు గడిస్తున్నారు. సమతుల్యమైన ఆహారంతోపాటు ఆదాయం పొందుతున్నారు. గుడ్లు, మాంసం అమ్మకాలతో మంచి రాబడిని పొందవచ్చు. పెరటి కోళ్ల పెంపకం వ్యవసాయ అనుబంధ రంగాల్లో ప్రధానంగా మారుతోంది. గ్రామాల్లో చిన్న, సన్నకారు రైతులు, వ్యవసాయ కూలీలు ఈ కోళ్ల పెంపకం ద్వారా ప్రత్యామ్నాయ ఆదాయాన్ని పొందుతున్నారు. ప్రస్తుతం నాటుకోడి మాంసానికి అధిక డిమాండ్ ఉంది. ఈ నాటుకోడికి ప్రత్యామ్నాయంగా కడక్‌నాథ్ కోడి కొత్తగా అందుబాటులోకి వచ్చింది. ఉత్తర భారతదేశంలోని పలు ప్రాంతాల్లో పెంచే ఈ జాతి కోళ్లకు వాతావరణం కూడా అనుకూలంగా ఉంటుందని శాస్త్రవేత్తలు సూచిస్తున్నారు. ఎన్నో పోషక విలువలుండి, వేసవిలో సుమారు వంద గుడ్ల వరకు పెట్టే ఈ జాతి కోడితో ప్రయోజనాల గురించి తెలుసుకుందాం.

**కడక్‌నాథ్ ప్రాచుర్యం :**

అత్యంత విలువైన పెరటి జాతి నాటు కోడి. అత్యంత పోషక విలువలు, రోగ నిరోధక శక్తి కలిగిన భారతీయ జాతి కోళ్లలో కడక్‌నాథ్ ఒకటి. ఈ కోడి అత్యంత ప్రాచుర్యం పొందుతోంది. "కడక్‌నాథ్" అనేది మధ్యప్రదేశ్, రాజస్థాన్, గుజరాత్లోని కొన్ని ప్రాంతాల్లో మాత్రమే దొరికే అరుదైన జాతికి చెందిన నాటుకోడి. ఆయా రాష్ట్రాల్లో నివసించే గిరిజనులు ఈ కోడిని ఎక్కువగా పెంచుతారు. అంతరించి పోతున్న నాటు కోడికి ప్రత్యామ్నాయంగా ఈ కోళ్ళను కూడా పెంచవచ్చని మాంసంలో పోషక విలువలు అధికం అని శాస్త్రవేత్తలు సూచిస్తున్నారు. వీటిని ఎక్కువగా కొండ జాతులు, ఆదివాసి ప్రజలు, గ్రామీణ ప్రాంతాలలో పెంచుతారు. దీనిని పవిత్రమైన జాతిగా గుర్తించి, దీపావళి పండుగలో దేవునికి నైవేద్యంగా పెడతారు.

**కడక్‌నాథ్ జాతి ప్రత్యేకతలు :**

- ముదురు నలుపు, ముదురు నీలం రంగుల్లో ఉండే కడక్‌నాథ్ కోళ్లలో వెంట్రుకలు, చర్మం, మాంసంతోపాటు రక్తం కూడా ఉంటుంది. ఈ కోళ్ళను కాలామాశీ అని కూడా పిలుస్తారు. అరుదుగా, కొన్ని పుంజులు నలుపుతోపాటు బంగారు రంగు ఈకలు కలిగి ఉంటాయి.
- కోడి పిల్ల నీలం రంగు నుంచి నలుపు వరకు ఉండి, వీపు మీద ముదురు రంగు గీతలు ఉంటాయి. ఈ జాతి మాంసం నల్లగా ఉన్నా, దీనికి చాలా ఔషధ విలువలతోపాటు. సెక్సు సామర్థ్యాన్ని పెంచుతుందని నమ్ముతారు. ఆదివాసీలు దీని రక్తాన్ని చాలా దీర్ఘ కాల జబ్బులకు ఉపయోగిస్తారు. అంతేగాక కటక్‌నాథ్ కోడి మాంసం, గుడ్లకు మంచి డిమాండ్ ఉంది. ముదురు నీలం రంగుతో ఉండే ఈకలు, చర్మం, మాంసంతోపాటు ఈ కోళ్ళ రక్తం నలుపు రంగులో ఉంటుంది. వీటి మాంసం, రక్తం అత్యంత అరుదైన సూక్ష్మ పోషకాలను కలిగి ఉంటాయి. గిరిజనుల మూలికా వైద్యంలో సైతం ఈ కోళ్ళ రక్తాన్ని వాడతారు.
- కడక్‌నాథ్ కోళ్ళకు రోగనిరోధక శక్తి ఎక్కువ. ప్రతికూల వాతావరణ పరిస్థితులను సైతం తట్టుకోగలవు.
- ఈ జాతి కోళ్ళలో పొదుగుడు లక్షణం తక్కువ. ఆరు నెలల వయసు నుండే గుడ్లు పెట్టడం ప్రారంభిస్తాయి. వేసవిలో సుమారు 100 గుడ్లు పెడుతుంది.

## కడక్‌నాథ్ పోషక విలువలు ప్రాముఖ్యత :

అత్యంత అరుదైన సూక్ష్మ పోషకాలు రక్తంలోనూ, మాంసంలోనూ ఉన్నాయి. మెలనిన్ అనే పదార్థం ఈ జాతి కోళ్ళలో అధికంగా వుంటుంది. ఈ మాంసం తినడం వల్ల మహిళలు అధిక రక్తస్రావం, గర్భస్రావం, ప్రసవానంతర సమస్యల నుంచి బయటపడవచ్చు. సాధారణ కోడి మాంసంతో పోలిస్తే ఈ జాతి కోళ్ళ మాంసంలో అధిక మాంసకృతులు, లినోలెనిక్ ఆమ్లాలు, తక్కువ కొవ్వు పదార్థాలు ఉన్నాయి. వీటి మాంసంలో మెలనిన్ పదార్థం అధిక మొత్తంలో వుండడం వల్ల, పురుషుల్లో నరాల బలహీనతకు, పురుషుల్లో వంధ్యత్వ నిరోధానికి సైతం వాడతారు. అలాగే దీని మాంసానికి వయాగ్రాల పని చేసే లక్షణం సైతం ఉందని శాస్త్రవేత్తల వాదన.

ఈ కోడి మాంసంలో బీ1, బీ2, బీ6, బీ12తో పాటు సీ, ఈ విటమిన్లు అధికంగా ఉంటాయి. పాస్ఫరస్, ఇనుము వంటి ధాతువులు మానవ శరీరానికి ఎంతో అవసరమైనవి. ఈ కోడి మాంసంలో ఇనుప ధాతువు బీ2 అధికంగా ఉండటం వలన నిమ్మోనియా, ఎనిమియా, క్షయ, ఆస్తమా వ్యాధుల నివారణకు కటక్‌నాథ్ కోడి మాంసం మంచి ఆహారంగా పనిచేస్తుంది.

- వాటితోపాటు అనేక శూల, సూక్ష్మధాతువులు కలిగి ఉండడం వల్ల కీళ్ళ సమస్యలు, ఎముకలు విరిగిన వారికి ఇది అద్భుత ఆహారంగా భావించవచ్చు. మైసూరులోని కేంద్ర ఆహార సాంకేతిక పరిశోధన సంస్థ నిర్వహించిన అధ్యయనాల్లో కడక్‌నాథ్ మాంసం గుండెకు రక్త ప్రసారాన్ని అభివృద్ధి పరుస్తుందని రుజువయింది.
- సాధారణ కోడి మాంసంతో పోలిస్తే ఈ జాతి కోడి మాంసంలో మాంసకృత్తులు అధికంగా ఉంటాయి. కొవ్వు శాతం తక్కువ. 8 అమైనో ఆమ్లాలతోపాటు, 18 అమైనో ఆమ్లాలు వీటి మాంసంలో వున్నట్లు శాస్త్రవేత్తలు ధ్రువీకరించారు. శరీరానికి అవసరమైన ఓమోగా ఆమ్లాల ఫాటో యాసిడ్ ప్రతిరూపమైన లినోలెనిక్ యాసిడ్ ఈ కోడి మాంసంలో ఉండటం ప్రత్యేకతగా చెప్పవచ్చు.
- వీటి గుడ్లను తలనొప్పి, నీరసం, ఆస్తమా, మూత్రపిండాల సంబంధిత వ్యాధులను తగ్గించడానికి వాడతారు. వయసు మళ్ళిన వారికి వీటి గ్రుడ్లు చాలా ఆరోగ్యదాయకం.
- గ్రుడ్లు, మాంసంలో ప్రొటీన్లు (25.47%), ఇనుము ఎక్కువగా ఉంటుంది.
- 20 వారాల వయస్సులో 920 గ్రాముల బరువు ఉంటుంది.
- గ్రుడ్లు పెట్టే వయస్సు – 180 రోజులు.
- సంవత్సరానికి గ్రుడ్ల ఉత్పత్తి – 105
- 40 వారాల వయస్సుకు గ్రుడ్ల బరువు 49 గ్రాములు
- గ్రుడ్లు పెట్టే సామర్థ్యం – 55%
- అధిక వృద్ధి శాతానికి షెడ్లల్లో 6 కోళ్ళకు, ఒక పుంజు చాలు.

## దాణా :

- తొలి దశలో పొడి లేదా నూక రూపంలో ఉండే మేతనే దాణాగా ఇవ్వాలి. ఎటువంటి వంట వ్యర్థాల నైనా అరిగించుకోగలడం వీటి ప్రత్యేకత.



## రోగ నిరోధక టీకాలు :

- కొక్కెర తెగులుకు – 7వ, 28వ రోజు, 9, 18, 41, 56వ వారాల్లో కొక్కెర తెగులు నివారణకు టీకా ఇవ్వాలి. 15వ, 21వ రోజుల్లో గంబోర; 6, 17 వారాల్లో కోళ్ళ మశూచికి టీకా ఇవ్వాలి.

**పోషక విలువలు :**

| | కడక్‌నాథ్ | ఇతర బ్రాయలర్ కోడి |
|---|---|---|
| మాంసకృత్తులు | 25 శాతం | 18-20 శాతం |
| కొవ్వు | 0.73-1.03 శాతం | 13-21 శాతం |
| లినోలిక్ ఆమ్లం | 24 శాతం | 21 శాతం |
| కొలెస్టరాల్ (రక్త నాళాల్లో పేరుకుపోయే కొవ్వు పదార్థం) | 18మి.గ్రా./100 గ్రా. | 218 మి.గ్రా./100 గ్రా. |

అలాగే ఇతరవాటితో పోలిస్తే, ఈ జాతి కోళ్ళలో పొదుగుడు లక్షణం తక్కువ. ఆరు నెలల వయసు నుండే గుడ్లు పెట్టడం ప్రారంభిస్తాయి. సాలుకు సుమారు నూరు గుడ్ల వరకు ఇస్తుంది. కోడి పిల్లలకు మొదటి 6 వారాలపాటు బ్రూడింగ్ పద్ధతిలో వేడిమి అందచేయడం అవసరం. ఆ తరువాత పెరటి పెంపకానికి అలవాటు చేయవచ్చు

## కడక్‌నాథ్ జాతిలోని ప్రతికూల విషయాలు :

అధిక డిమాండ్, సహజ మేతతో నిదానంగా పెరగడం, పిల్లల దశలోనే 50 శాతం మరణించడం వంటి కారణాల వల్ల, ఈ జాతి కోళ్లు వృద్ధి చెందడం లేదు. అంతరించిపోతున్న కడక్‌నాథ్ జాతి నాటు కోళ్లను పరిరక్షించుకోవాల్సిన ఆవశ్యకత ఉంది. ప్రభుత్వం కూడా ఈ జాతి అంతరించి పోకుండా, వీటి సంఖ్యను పెంచే దిశగా చర్యలు జరుపుతుంది. కడక్‌నాథ్ నుంచి కారిశ్యామ పేరుతో సంకరజాతిని ఇజాత్ నగర్‌లోని కేంద్ర పక్షిజాతుల అభివృద్ధి సంస్థ (కారి)లో అభివృద్ధి చేశారు.

## కారీశ్యామా (కడకనాథ్ క్రాస్) :

ప్రాంతీయంగా 'కలమాశి' అంటారు, అంటే దీని అర్థం నల్లని మాంసం కలది – మధ్యప్రదేశ్‌లోని జాబ్వా, ధర్ జిల్లాలు, రాజస్థాన్, గుజరాతీ సరిహద్దు ప్రాంతాలలో సుమారు 800 చదరపు మైళ్ళ విస్తీర్ణంలో వ్యాపించి వుంటాయి .

**గమనిక :** కోళ్ళు కావాలనుకునే వారు ఆండ్రోయిడ్ ఫోన్‌లోని ప్లే స్టోర్ నుండి **MP KADAKNATH** యాప్ ద్వారా కొనుగోలు చేయగలరు.

ఒక రోజు వయస్సు గల కోడి పిల్లలు 120/- రూపాయలు, ఒక నెల వయస్సు గల కోళ్ళు 250/- రూపాయలు.




# నువ్వుల సాగు


సబియా బేగం, (బి.ఎస్.సి ఫైనల్ ఇయర్)
పి.జె.టి.ఎస్.ఎ.యు అగ్రికల్చరల్ కాలేజీ, పాలెం
సి. యమున, సైంటిస్ట్,
డాక్టర్. ఎన్. ప్రవీణ్, ప్రిన్సిపల్ సైంటిస్ట్,
డి.ఎ.ఎ.టి.టి.సి తాండూరు.


నువ్వుల శాస్త్రీయ నామం సెసేమమ్ ఇండికమ్. ఈ నువ్వులు పిడాలియేసినయే కుటుంబానికి చెందినవి. నువ్వులు ఒక రకమైన, ఆకర్షణీయమైన రంగుతోపాటు, వగరు రుచిని కలిగి ఉంటాయి. అందువల్ల ఇవి ప్రపంచ వ్యాప్తంగా వంటకాల్లో ముఖ్య అంశంగా వుంటాయి. నువ్వుల్లో 46 నుండి 55 నూనె శాతం, ప్రోటీను 20 నుంచి 25 శాతం ఉండటమే గాక విటమిన్లు, అమైనో ఆమ్లాలు, పాలీ అన్‌శాచిరేటెడ్ ఫ్యాటీ ఆమ్లాలు కూడా సమృద్ధిగా ఉంటాయి.

ఖరీఫ్‌లో వర్షాలు ఆలస్యంగా కురిసినప్పుడు, కేవలం ఒక పంట మాత్రమే సాగు చేసుకునే పరిస్థితుల్లో నువ్వులు ఒక మంచి ప్రత్యామ్నాయ పంటగా ఆగస్టు రెండో పక్షం వరకూ విత్తుకొని అధిక దిగుబడులు పొందవచ్చు. అలాగే ఆలస్యంగా వేసిన ఖరీఫ్ పంటల తర్వాత రెండో పంటగా జనవరి, ఫిబ్రవరి మాసాల్లో విత్తుకొని అతి తక్కువ సమయంలో అధిక లాభాన్ని పొందవచ్చు.

**నేలలు :** మురుగునీరు నిలువని తేలికైన నేలలు శ్రేష్టం. నీరు నిలిచే ఆమ్ల, క్షార గుణాలుగల నేలలు పనికిరావు.

**నేల తయారీ :** నేలను 2-4 సార్లు మెత్తగా దున్ని రెండుసార్లు గుంటక తోలి చదును చేయాలి.

**విత్తనం విత్తే పద్ధతి :** ఎకరానికి 2-5 కిలోల విత్తనం సరిపోతుంది. విత్తనానికి మూడింతల ఇసుక కలిపి గొర్రుతో వరుసల్లో విత్తుకోవాలి. వరుసల మధ్య 30 సెంటీమీటర్లు (12 అంగుళాలు), మొక్కల మధ్య 15 సెంటీమీర్లు (6 అంగుళాలు) దూరం ఉండేలా విత్తుకోవాలి.

**విత్తే సమయం :** ఖరీఫ్‌కు ముందు - మే రెండో పక్షంలోపు
లేట్ ఖరీఫ్ - ఆగస్టు రెండో పక్షం
వేసవి - జనవరి రెండో పక్షం నుంచి ఫిబ్రవరి మొదటి పక్షం

**రకాలు :** శ్వేత - 85-90 రోజులు పంటకాలం (లేట్ ఖరీఫ్, వేసవి)
హిమ - 80-85 రోజుల పంటకాలం (ఖరీఫ్ / వేసవి)
రాజేశ్వరి - 80-90 రోజుల పంటకాలం (లేట్ ఖరీఫ్, వేసవి)
చందన - 80-85 రోజుల పంటకాలం (ఖరీఫ్ / వేసవి)
ఎలమంచిలి, 66 శారద - 75-80 రోజుల పంటకాలం (ఖరీఫ్ / వేసవి)
గౌరి - ఖరీఫ్ 90 రోజల పంటకాలం (ఖరీఫ్)

**విత్తనశుద్ధి :** కిలో విత్తనానికి 3 గ్రాముల మంకోజెబ్‌తో విత్తనశుద్ధి చేయాలి. పంట తొలిదశలో రసం పీల్చే పురుగుల బారి నుండి కాపాడటానికి ఇమిడాక్లోప్రిడ్ 2.0 మిల్లీలీటర్లు కిలో విత్తనానికి కలిపి శుద్ధి చేసుకోవాలి.

**ఎరువులు :** ఖరీఫ్‌లో ఆఖరి దుక్కిలో ఎకరానికి 4 టన్నుల పశువుల ఎరువు, 16 కిలోల నత్రజని, 8 కిలోల పొటాష్, 8 కిలోల భాస్వరాన్నిచ్చే ఎరువులు వేసుకోవాలి. విత్తిన 30 రోజుల తరువాత మరో 18 కిలోల యూరియా అందజేయాలి. వేసవిలో వీటితోపాటు 8 కిలోల నత్రజనిని (15-18 కిలోల యూరియా) అదనంగా పైపాటుగా వేసుకోవాలి.

**నీటి యాజమాన్యం (వేసవి) :** విత్తిన వెంటనే పలుచటి తడి ఇవ్వాలి. పూత, కాయ అభివృద్ధి, గింజ కట్టు దశల్లో తడులు ఇవ్వాలి. నువ్వులు సాగు చేసే నేలలో తేమ ఎక్కువ ఉన్న పరిస్థితుల్లో మొక్కల శాఖీయోత్పత్తి మాత్రమే జరిగి ఆకులు, కొమ్మలు ఎక్కువగా వచ్చి పూత, కాయ రాకుంటే నిలిచిపోవడం జరుగుతుంది. కనుక ఈపంట సాగు చేసేటప్పుడు ఎక్కువ మోతాదులో నీరు అందజేయకూడదు.

**కలుపు నివారణ, అంతరకృషి :** పెండిమిథాలిన్ 30 శాతం ఎకరానికి లీటరు చొప్పున విత్తినగాని వెంటనేగాని, మరుసటి రోజుగాని పిచికారీ చేసుకోవాలి. మొక్కలు మొలిచిన 15 రోజులకు అదనపు మొక్కలను తీసివేయాలి. విత్తిన 20, 25 రోజులప్పుడు గొర్రుతో అంతరకృషి చేసుకోవాలి.

## సస్యరక్షణ - పురుగులు

**రసం పీల్చే పురుగులు (తామర పురుగులు, పచ్చదోమ) :** పిల్ల, తల్లి పురుగులు అడుగు భాగాన చేరి ఆకుల నుండి రసాన్ని పీల్చివేస్తాయి. పురుగులు ఆశించిన ఆకులు ముందుగ పాలిపోయి, తర్వాత దశలో ఎండిపోతాయి. తెల్లనల్లి ఆశిస్తే ఆకులు ముదురు ఆకుపచ్చ రంగుకు మారి ఈనెలు పొడవుగా సాగి కింద వైపునకు ముడుచుకుపోయి దోనె ఆకారంలో మారి పాలిపోతాయి.

**నివారణ :** మోనోక్రోటోఫాస్ 1.6 మిల్లీలీటర్లు లేదా డైమిథోయేట్ 2.మిల్లీలీటర్లు లీటరు నీటికి కలిపి పిచికారీ చేసుకోవాలి. తెల్లనల్లి నివారణకు డైకోఫాల్ 5 మిల్లీలీటర్లు.. లీటరు నీటికి కలిపి పిచికారీ చేసుకోవాలి.

**ఆకుముడత, కాయతొలుచు పురుగు :** తొలిదశలో చిన్న గొంగళి పురుగులు లేత ఆకులను కలిపి గూడు కట్టి లోపలి నుండి ఆకుల్లోని పచ్చని పదార్థాన్ని గోకి తినడం వల్ల ఆకులు ఎండిపోతాయి. పురుగులు ఎదిగిన కొద్దీ ఎక్కువ ఆకులను కలిపి గూడుగా చేసుకొని ఆకులను తింటాయి. మొగ్గ ఏర్పడే దశలో మొగ్గలను, పూతను, కాయల్లోని లేత గింజలను తింటూ పంటకు నష్టం చేస్తాయి.



**నివారణ :** మోనోక్రోటోఫాస్ 1.6 మిల్లీలీటర్లు లేదా క్లోరిఫైరిఫాస్ 2.5 మిల్లీలీటర్లు లీటరు నీటికి కలిపి పిచికారీ చేయాలి.

**కోడు ఈగ :** చిన్న పురుగులు లేత మొగ్గ పూత తినివేయడం వల్ల మొగ్గలు పువ్వులుగా, కాయలుగా ఏర్పడక గింజ కట్టక తాలు కాయలు ఏర్పడతాయి. ఆశించిన మొగ్గ, పూత వాడి రాలిపోతుంది.

**నివారణ :** మొగ్గదశలో మోనోక్రోటోఫాస్ 1.6 మిల్లీలీటర్లు లేదా ఎసిఫేట్ 75 ఎస్.పి 1 గ్రాము లీటరు నీటకి కలిపి పిచికారీ చేయాలి.

**బీహారి గొంగళిపురుగు :** తొలిదశలో చిన్న గొంగళి పురుగులు గుంపులుగా ఆకులలోని పత్రహరితాన్ని గోకి తిని జల్లెడాకులుగా చేస్తాయి. ఎదిగిన గొంగళి పురుగులు ఇతర మొక్కలపైకి పాకుతూ మొగ్గలకు, పువ్వులకు, కాయలకు రంధ్రాలు చేస్తూ విత్తనాలను తినివేస్తాయి.

**నివారణ :** పంటలో గుడ్లు లేక గొంగళి పురుగులను గమనించిన వెంటనే ఆకులతోసహా తీసివేసి నాశనం చేయాలి. క్లోరిపైరిఫాస్ 2.5 మిల్లీలీటర్లు లేదా ఎసిఫేట్ 75 ఎస్‌పి 1 గ్రాము.. లీటరు నీటికి కలిపి పిచికారీ చేయాలి.

**తెగుళ్ళ - వేరుకుళ్ళు తెగులు :** కాండం మీద నల్లని చారలేర్పడతాయి. వేర్లను చీల్చి పరిశీలిస్తే గోధుమ రంగు చారలు కనిపిస్తాయి. వేర్లు పూర్తిగా లేదా పాక్షికంగా కుళ్లిపోతాయి. ఎండు తెగులు సోకిన కాండం మీద, కాయల మీద గులాబీ రంగు శిలీంధ్ర బీజాల సముదాయం కన్పిస్తుంది. తెగులు కలిగించే శిలీంధ్రం భూమిలోనూ, విత్తనాలు, పంట అవశేషాలపైనా జీవిస్తుంది.

పంట మార్పిడి తప్పకుండా చేయాలి. కిలో విత్తనానికి 3.గ్రాముల కాప్టాన్ లేదా కార్బండిజమ్ కలిపి విత్తనశుద్ధి చేసుకోవాలి. కాపర్ ఆక్సీక్లోరైడ్ లేదా మాంకోజెబ్ 3 గ్రాములు లీటరు నీటికి కలిపి పిచికారీ చేసుకోవాలి.

**ఆకుమచ్చ (ఆల్టర్నేరియా) తెగులు :** మొక్క ఎదిగే దశలో గాలిలో తేమ శాతం అధికంగా ఉన్నప్పుడు ఎక్కువగా వ్యాపిస్తుంది. ఆకులపై, కాండం మీద గోధమ రంగు మచ్చలు ఏర్పడతాయి. మచ్చలు ఆకు అంతా వ్యాపించి ఆకులు ఎండిపోయి రాలిపోతాయి.

కిలో విత్తనాలకు 3 గ్రాముల కార్బండిజమ్ కలిపి విత్తనశుద్ధి చేసుకోవాలి. పంట దశలో కార్బండిజమ్ 1 గ్రాము లేక మాకోజెబ్ 2.5 గ్రాములు.. లీటరు నీటిలో కలిపి 15 రోజుల వ్యవధిలో 2-3 సార్లు పిచికారీ చేసుకోవాలి.

**వెర్రితెగులు (ఫిల్లోడి) :** ఈ తెగులు పూత సమయంలో ఆశిస్తుంది. సాధారణంగా ఆలస్యంగా వేసిన పంటలో ఎక్కువగా వస్తుంది. తెగులు సోకిన మొక్కల్లో ఆకులు చిన్నవై పువ్వుల్లోని భాగాలన్నీ ఆకుల మాదిరిగా మారిపోయి కాయలు ఏర్పడవు. ఈ తెగులు దీపపు పురుగుల ద్వారా వ్యాప్తి చెందుతుంది.

పైరుపై మిథైల్ డెమటాన్ 2.మిల్లీలీటర్లు లేదా డైమిథోయేట్ 2 మిల్లీలీటర్లు లీటరు నీటికి కలిపి పిచికారీ చేసి దీపపు పురుగులను అరికట్టాలి.

**బూడిద తెగులు :** లేత ఆకులపై తెల్లని బూడిద పొడి మచ్చలు ఏర్పడతాయి. తెగులు ఆశించిన ఆకులు మాడి రాలిపోతాయి. నీటిలో కరిగే గంధకపు పొడి 3 గ్రాములు లీటరు నీటిలో కలిపి పిచికారీ చేసుకోవాలి.

**పంటకోత :** ఆకులు పసుపు రంగుకు మారి రాలడం ప్రారంభమైనప్పుడు, 75 శాతం కాయలు లేత పసుపు వర్ణానికి వచ్చినప్పుడు పైరు కోయాలి. కోసిన పంటను కట్టలుగా కట్టి నూర్పిడి చేయాలి.

**నిల్వ చేయడం :** గింజల్లో తేమ 8 శాతానికి తగ్గేవరకూ ఎండలో ఆరబెట్టాలి. గోనె సంచుల్లో నిల్వ చేయాలి. నిల్వ ఉంచిన సంచులపై మలాథియాన్ పొడిని చల్లాలి. పురుగు పట్టకుండా అప్పుడప్పుడు ఎండలో ఆరబెట్టాలి.




# పంట సస్యరక్షణలో డ్రోన్ల పాత్ర విశిష్టం

డాక్టరు జె. మంజునాథ్, డాక్టరు ఎస్. రమా దేవి,
డాక్టరు వి.జయలక్ష్మి, డాక్టరు బిహెచ్ చైతన్య
ప్రాంతీయ వ్యవసాయ పరిశోధన స్థానం, నంద్యాల
డాక్టరు ఎ. సాంబయ్య (అప్సర ప్రాజెక్టు),
ఆచార్య ఎన్‌జి రంగా వ్యవసాయ విశ్వ విద్యాలయం, గుంటూరు.

మన దేశంలో 70 శాతానికి పైగా రైతులు వ్యవసాయంపై ఆధారపడి ఉన్నారు. వ్యవసాయంలో పెట్టే పెట్టుబడిలో కూలీల కొరత కారణంగా సస్యరక్షణకు ఎక్కువ ఖర్చు అవుతోంది. సాంకేతికత పెరుగుతున్న ఈ క్రమంలో పిచికారీ చేసే వ్యవసాయ డ్రోన్‌ల వాడకంపై రైతులు బాగా ఆసక్తి చూపుతున్నారు. డ్రోన్‌ల వాడకం సులభంగా ఉండటమే కాకుండా సరైన సమయంలో తక్కువ ఖర్చుతో స్ప్రే చేయడం, పలు లాభాలుండటం వలన డ్రోన్‌లకు రైతుల్లో బాగా డిమాండ్ పెరిగింది.

## డ్రోన్ ఎలా పనిచేస్తుంది?

డ్రోన్ అనేది ఒక ఎగిరే పరికరం. ఇది జిపియెస్, ఆటో పైలట్ సహాయంతో రిమోట్ ద్వారా లేదా ఎల్‌సిడి మొబైల్ లో అగ్రిమీట్/అగ్రి అసిస్టెంట్ యాప్ ద్వారా ముందుగా పొలంపైన సెట్ చేసిన ఎత్తులో, నిర్దిష్టమైన వేగంలో, దిశలో ఎగురుతుంది. ఒక డ్రోన్ ధర రూ.3 లక్షల నుంచి - రూ.12 లక్షల వరకు ఉండి, మార్కెట్లో రకరకాల నమూనాల్లో లభ్యమవుతున్నాయి. డ్రోన్‌లో 12-16 వేల ఎమ్ఎహెచ్ లీథియం పాలిమర్ బ్యాటరీ ఉంటుంది. 10 లీటరు డ్రమ్, ఒక జత బ్యాటరీతో కలిపి డ్రోన్ 13 కిలోల బరువుంటుంది. ఒకసారి ఒక జత బ్యాటరీతో సుమారుగా ఒక ఎకరానికి 10 నిమిషాల్లో పిచికారి పూర్తిచేయవచ్చు. సిగ్నల్ పోయినా, మందు అయిపోయినా, బ్యాటరీ అయిపోయినా, స్ప్రే పూర్తి అయినా డ్రోన్ మొదట ఉన్న చోటికే తిరిగి వస్తుంది. డ్రోన్ ద్వారా స్ప్రే పూర్తి చేసినది, స్ప్రే చేయాల్సినది , స్ప్రే చేస్తున్న ప్రదేశాన్ని మొబైల్ యాప్‌లో ఎరుపు, పసుపు, ఆకుపచ్చ రంగుల్లో చూడవచ్చు. దీనిని సులభంగా వినియోగించడానికి వీలుగా ఒక పైలట్ (ఆపరేట్ చేయడానికి, ల్యాండింగ్, డ్రోన్ తప్పిపోకుండా శాస్త్రీయ శిక్షణ పొందిన వ్యక్తి), రీఛార్జి చేస్తూ, బ్యాటరీలు మార్చడానికి ఒక వ్యక్తి , మ్యాపింగ్ చేయడానికి ఒక వ్యక్తి అవసరం. దీన్ని వినియోగించే వ్యక్తికి ప్రభుత్వ క్లియరెన్స్‌తోపాటు డిజిసిఏ వారి నుంచి అనుమతి అవసరం.

## డ్రోన్ల వల్ల లాభాలు

- డ్రోన్లతో అన్ని రకాల పురుగు, తూగులు, కలుపు మందులు, ఆర్గానిక్ ద్రావణాలు, నీటిలో కరిగే ఎరువులు కూడా స్ప్రే చేయవచ్చు.
- తక్కువ ఖర్చు అనగా ఒక కూలికి అయ్యే ఖర్చు రూ. 400/-లతో ఒక ఎకరానికి, తక్కువ సమయంలో అనగా 10 నిమిషాల్లో స్ప్రే పూర్తి చేయవచ్చు.
- ఏ సమయంలో అయినా ఏ పంటకైనా సులభంగా స్ప్రే చేయవచ్చు. 6 గంటల్లో 30 ఎకరాల దాకా ఒక రోజులో స్ప్రే చేయవచ్చు.
- స్ప్రేలో 90 శాతం నీటిని, 95 శాతం సమయాన్ని, 25-40 శాతం మందు ద్రావకాన్ని ఆదా చేస్తూ తద్వారా పెట్టుబడి ఖర్చును కూడా తగ్గించుకోవచ్చు.
- ఒకసారి ఒక జత బ్యాటరీలు ఛార్జింగ్ పెడితే 40 నిమిషాలపాటు డ్రోన్‌ను వాడుకోవచ్చు.

- వరిలాంటి పంటల్లో కూడా సుడి దోమలాంటి మొండి పురుగులనైనా సమర్థవంతంగా అరికడుతుంది.
- పురుగు మందుల వాడకం ద్వారా రైతుల్లో వచ్చే అనారోగ్య సమస్యలు, దుష్ప్రభావాల నుంచి తప్పించవచ్చు.
- పురుగు/ తెగుళ్లు కనిపించిన వెంటనే స్ప్రే చేసి వ్యాప్తిని అరికట్టవచ్చు.
- మొక్కలకు ఏ మాత్రం నష్టం వాటిల్లకుండానే, పొలంలో దిగకుండా దూరం నుంచే సమర్థవంతంగా స్ప్రే చేయవచ్చు.
- ఎకరానికి 10-14 లీ. నీటిలో కరిగిన మందు ద్రావణం సరిపోతుంది.
- ఏ పంట మీదైనా 2-3 అడుగుల ఎత్తులో పొలమంతా సమానంగా స్ప్రే చేస్తుంది.
- మందు మోతాదు నాల్గవ వంతు తగ్గడం వలన పర్యావరణానికి కలిగే కాలుష్యాన్ని కూడా తగ్గించవచ్చు.
- వీటితోపాటు డ్రోన్ స్ప్రే వలన యువతకు మంచి ఉపాధి కూడా దొరుకుతుంది.

పై లాభాల వలన డ్రోన్ల వినియోగాన్ని వ్యవసాయంలో సాయంగా రైతులు ఆహ్వానిస్తున్నారు. కావున పెరిగే పరిజ్ఞానంతో పాటు వ్యవసాయం కూడా కొత్త దారుల్లో ముందుకు వెళ్ళేదిశలో పయనిస్తుంది. *



# రైతు స్థాయిలో మొలక శాతం పరీక్షించే పద్ధతి


కేతావత్ నరేష్
(పి.హెచ్.డి. రీసెర్చి స్కాలర్)
ఎస్.కె.యు.ఎ.ఎస్.టి. కశ్మీర్


వివిధ పంట కాలాలు, వాతావరణ పరిస్థితులను బట్టి అనువైన పంటల సాగుకు రైతులు సిద్ధమవుతుంటారు. అధిక దిగుబడులు సాధించి మంచి ఫలసాయం పొందాలనేది అందరి భావన. లాభసాటి పంటకు విత్తనం ప్రధానం. మొలక శాతం బాగా ఉన్న విత్తనాన్ని సేకరించుకోవాలి.

విత్తనం కొనుగోలు చేశాక మొలక శాతాన్ని పరిశీలించి నాణ్యతా ప్రమాణాలకు అనుగుణంగా ఉంటేనే విత్తుకోవాలి. మొలక శాతాన్ని లెక్కించడానికి నాలుగు పద్ధతులున్నాయి.

**ట్రే పద్ధతి :** లావు గింజలైన ఆముదం, వేరుశనగ, ప్రత్తి విత్తనాలను ట్రే పద్ధతిలో పరీక్షించవచ్చు. ఒక ప్లాస్టిక్ ట్రేని గాని, కుండీని గాని, ఇసుకతో నింపి వంద విత్తనాలను అంగుళం లోతుగా నిర్ణీత ఎండలో విత్తాలి. ఇసుకను నీటితో తడుపుతూ ఉంటే 7-10 రోజుల్లో మొలకలు వస్తాయి. వందకు ఎన్ని మొలకలొచ్చాయో లెక్కించి శాతాన్ని తెలుసుకోవచ్చును. నిర్దేశించిన శాతం కన్నా తక్కువ మొలకలొస్తే నాణ్యత లోపించిన విత్తనాలుగా భావించాలి.

**గుడ్డలో మూట కట్టే పద్ధతి :** వంద విత్తనాలను తడి గుడ్డలో మూటగట్టి, ప్లేటులో పెట్టి తరచూ మూటను నీటితో తడుపుతుండాలి. మొలకలొచ్చాక లెక్కించి శాతాన్ని తెలుసుకోవచ్చును.

**పెట్రిడిష్ :** వంగ, టమోట, మిరప వంటి చిన్న విత్తనాల మొలక శాతాన్ని ఈ పద్ధతి ద్వారా తెలుసుకోవచ్చు. పెట్రిడిష్‌లో బ్లాటింగ్ పేపరు అమర్చి నీటితో తడపాలి. దానిపై వంద విత్తనాలను అమర్చి మూత పెట్టాలి. తేమ ఆరిపోకుండా బ్లాటింగ్ పేపరును నీటితో తడుపుతుండాలి. మొలకెత్తిన గింజలను లెక్కించి మొలక శాతాన్ని సులభంగా తెలుసుకోవచ్చును.

**పేపరు టవలు పద్ధతి :** వరి, ప్రత్తి, పొద్దు తిరుగుడు, జొన్న తదితర విత్తనాల్లో మొలక శాతాన్ని తెలుసుకోవడానికి ఈ పద్ధతి అనుకూలంగా ఉంటుంది. ముందుగా పేపరు టవలు లేదా మందపాటి వస్త్రాన్ని తీసుకొని నీటితో తడపాలి. దీన్ని నేలపై / బల్లపై పరిచి వంద విత్తనాలను వరుస క్రమంలో అమర్చాలి. విత్తనాలపై మరో పేపరు టవలు గాని, వస్త్రాన్ని గాని కప్పాలి. ఈ రెండింటిని చాపలా చుట్టి చివర్లను దారంతో కట్టి లోతైన పాత్రలో ఏటవాలుగా పెట్టాలి. అప్పుడప్పుడు నీటితో తడిపితే మొలకలొస్తాయి. మొలక శాతాన్ని లెక్కించేటప్పుడు కుళ్లిపోయిన, మొలకరాని గట్టి విత్తనాలు బూజు పట్టిన, వేరు , కాండం పూర్తిగా అభివృద్ధి చెందని, బలహీనంగా ఉన్న మొలకలను పరిగణనలోకి తీసుకోకూడదు.

**వివిధ పంటల్లో నిర్దేశించిన విత్తన మొలకశాతం**

| | |
|---|---|
| 90 శాతం - | మొక్కజొన్న (సంకర రకాలు) |
| 85 శాతం - | శనగ |
| 80 శాతం - | వరి, ఉలవలు, లూసర్న్, మొక్కజొన్న (సూటి రకాలు) |
| 75 శాతం - | జొన్న, కంది, పెసర, మినుము, జీలుగ, అలసంద |
| 70 శాతం - | ఆముదం, వేరుశనగ, పొద్దుతిరుగుడు, సోయా చిక్కుడు. |



# పూసా గోల్డెన్ చెర్రీ టొమాటో - 2

## హరిత గృహ సాగుకు మొట్టమొదటి చెర్రీ టొమాటో రకం

పూసా చెర్రీ టమాటో – 1 తరువాత భారతీయ వ్యవసాయ పరిశోధన సంస్థ, న్యూఢిల్లీ.. మరొక చెర్రీ టొమాటో రకాన్ని ప్రవేశపెట్టింది. దానిపేరే పూసా గోల్డెన్ చెర్రీ టొమాటో–2. ఇది దేశీయ మొట్టమొదటి గోల్డెన్ చెర్రీ టమాటో రకం. దీనినే తెలుగులో పసుపు చెర్రీ టొమాటో అని పిలుస్తారు. ఈ రకం తక్కువ ధర రక్షిత గృహ సాగు కోసం రూపొందించబడింది.

టొమాటో రకాల్లో చెర్రీ టొమాటోలు ప్రత్యేకమైనవి. వీటిని సలాడ్లలో ఎక్కువగా వాడతారు. చెర్రీ టొమాటోలు గుత్తుల్లా కాస్తాయి. ప్రతి మొక్కకు 9 నుండి 10 గుత్తులు ఉంటాయి. ఈ టొమాటోలు గుండ్రని, కోల, పియర్ ఆకారాలలో ఉంటాయి. పండ్ల పరిమాణం 2 నుండి 15 గ్రాముల మధ్యలో ఉంటుంది. పండ్లు వివిధ రంగుల్లో అంటే, ముదురు ఎరుపు, ఎరుపు, గులాబీ, పసుపు, బంగారు పసుపు నుండి నారింజ రంగుల్లో ఉంటాయి. ఈ గోల్డెన్ చెర్రీ టొమాటోలు చూడటానికి చాలా అందంగా కనిపిస్తాయి. ఈ రకంలో పోషక విలువలు అధికంగా ఉంటాయి. ఇందులో విటమిన్ "ఎ" విటమిన్ "సి" ఉంటుంది. అంతేగాక, పండ్లలో 13.02 మి.గ్రా. కెరోటిన్, 18.3 మి.గ్రా. ఆస్కార్బిక్ యాసిడ్, 0.33% ఆమ్లత్వం మొత్తం కరిగే ఘన పదార్థాలు 90 బ్రిక్స్ ఉంటుంది.

### సాగుచేసే విధానం

**వాతావరణం :**

ఈ రకం సాగుకు వేడిగా ఉండే వాతావరణం కావాలి. పండ్ల, రంగు అభివృద్ధికి అనువైన రాత్రి, పగటి ఉష్ణోగ్రత 20 నుండి 25 డిగ్రీ సెల్సియస్ ఉండాలి.

**నేల స్వభావం :**

మురుగు నీరు సదుపాయంగల తేలికపాటి నేలలు ఈ పంటకు అనుకూలం. నేల ఉదజని సూచిక 6 నుండి 7 మధ్య ఉండాలి.


మోటపలుకుల జ్యోతి,
పి. హెచ్.డి. స్కాలర్, ఉద్యాన విభాగం,
వసంతరావ్ నాయక్ మరత్వాడ వ్యవసాయ విశ్వవిద్యాలయం, పర్భాని, మహారాష్ట్ర.
పి.కె.సింగ్, ప్రధాన శాస్త్రవేత్త,
సెంటర్ ఫర్ ప్రొటెక్టెడ్ కల్టివేషన్ టెక్నాలజీ,
ఐ.సి.ఎ.ఆర్ - భారతీయ వ్యవసాయ పరిశోధన సంస్థ,
పూసా, న్యూఢిల్లీ.


**విత్తే సమయం :**

• పూర్తిగా నియంత్రించబడిన హరిత గృహ వాతావరణంలో ఈ పంటను సంవత్సరం పొడవునా పెంచవచ్చు. అయితే సహజంగా గాలి, వెలుతురు వచ్చే లేదా తక్కువ ధర హరిత గృహ నిర్మాణాల్లో సెప్టెంబరులో నాటుకోవాలి.

**విత్తన మోతాదు :**

ఒక హెక్టారుకు 125 గ్రాముల విత్తనం సరిపోతుంది. 1000 ఎం 2 స్థలానికి అయితే 10 గ్రాముల విత్తనం సరిపోతుంది.

**నర్సరీ పెంపకం :**

నర్సరీలో పెంచుకోవడానికి నెట్ నిర్మాణం అవసరం. తెగుళ్లు లేని ఆరోగ్యకరమైన నారు పెంచడానికి జులై నుండి ఆగస్టు నెలలు అనుకూలం. విత్తుకోవడానికి మల్టిసెల్ కలిగిన ట్రేలను ఎంచుకోవాలి. కోకోపిట్, పెర్లైట్ వెర్మికులైట్ మిశ్రమాన్ని తయారు చేసుకోవాలి. విత్తిన ట్రేలను పాలీహౌస్‌లో కానీ నెట్ హౌస్‌లో కానీ ఉంచాలి. విత్తేముందు థైరామ్ ఏ 3 గ్రాములు కిలో విత్తనానికి విత్తనశుద్ధి చేసుకోవాలి. ప్రతి సెల్లో ఒక విత్తనాన్ని మాత్రమే వేయాలి. విత్తనాన్ని నాటిన వెంటనే, 2 గ్రాముల కాప్టాప్ కలిగి ఉన్న నీటిని ఇవ్వాలి. ఆ

తరువాత, ట్రేలన్ని ఒకదానిపై ఒకటి పేర్చాలి. అన్నిటికంటే పైన ఉంచిన ప్రోట్రేని ఖాళీట్రేతో కప్పి ఉంచాలి. విత్తిన నాలుగు నుండి ఐదు రోజుల్లో విత్తనాలు మొలకెత్తుతాయి. ఆ తరువాత ట్రేలన్ని నేల మీద పర్చాలి. నీటిలో కరిగే పోషకాలను ఎరువుల రూపంలో అనగా నైట్రోజన్, భాస్వరం, పొటాషియంలను 16:16:16 నిష్పత్తిలో ఒక లీటరు నీటికి 2 గ్రాముల చొప్పున ప్రతివారానికి ఒకసారి నారుకు అందించాలి. నాటిన 22 నుండి 25 రోజుల తరువాత, అంటే నారు 10 నుండి 12 సెం.మీ. పొడవు, నాలుగు ఆకులు కలిగిన దశలో రెండు నుండి మూడు రోజుల వరకు నీరు అందించకుండా వుంచాలి. ఇలా చెయ్యడం వల్ల నారు పొలంలో నాటిన తర్వాత షాక్‌కు గురి అవ్వకుండా ఉంటుంది. దాంతో మొక్కలు చనిపోకుండా ఉంటాయి.

**నారు నాటడం :**

0.75 మీటర్ల వెడల్పుతో 10 సెం.మీ. ఎత్తు ఉన్న బెడ్లను తయారు చేసుకోవాలి. బెడ్‌కు రెండువైపులా వరుసలో 0.60 మీటర్ల దూరంలో నారును నాటుకోవాలి. రెండు బెడ్‌ల మధ్య 30 సెం.మీ. కాలిబాట ఉండే విధంగా తయారు చేసుకోవాలి. నీరు, ఎరువులను సమర్థవంతంగా ఉపయోగించడానికి బిందు సేద్యం పద్ధతిని అవలంబించాలి.

**పోషకాల నిర్వహణ :**

హరిత గృహంలో ఉన్న మట్టి సారాన్ని తెలుసుకోవడానికి తప్పనిసరిగా మట్టి పరీక్ష చేయించాలి. పోషక లోపం రాకుండా వుండేందుకు అవసరమైనప్పుడల్లా పోషకాలు అందించాలి. సాధారణంగా, నేల తయారీ సమయంలో హెక్టారుకు సుమారుగా 25 నుండి 30 మెట్రిక్ టన్నుల బాగా మాగిన పశువుల ఎరువును వెయ్యాలి. దీనికి అదనంగా, నారు నాటడానికి ముందు 80 కిలోల భాస్వరం, 90 కిలోల పొటాష్‌ను వేసుకోవాలి. 150 కిలోల నత్రజనిని మూడు దఫాలుగా అనగా మూడింట ఒకవంతు నాటు సమయంలో, ఇతర మూడింట రెండువంతులు నాలుగు టాప్ డ్రెస్సింగ్ల రూపంలో ఇవ్వాలి. ఇందులో, మొదటది నాటిన 25 నుండి 30 రోజుల తర్వాత, రెండవది నాటిన 50 నుండి 60 రోజుల తర్వాత లేదా పూత దశలో, మూడవది మొదటి కోత తర్వాత, ప్రతికోత తర్వాత ఇవ్వాలి. సూక్ష్మధాతు పోషకాల మిశ్రమాన్ని, ముఖ్యంగా కాల్షియం, బోరాన్‌ను పూతదశలో పిచికారీ చెయ్యాలి.

**నీటి యాజమాన్యం :**

అతిగా నీరు ఇవ్వకుండా, నేలలో సరిపడ తేమ ఉండేలా చూసుకోవాలి. పూత దశలో, కాయ దశలో నీరు ఎంతో అవసరం. తగినంత తేమకూడా మంచి రంగు అభివృద్ధికి సహాయ పడుతుంది. శీతాకాలంలో నీటిపారుదల 8 నుండి 10 రోజుల వ్యవధిలో ఇవ్వాలి. వేసవి నెలల్లో, వాతావరణ పరిస్థితులనుబట్టి 3 నుండి 4 రోజుల విరామంలో నీటిని అందించాలి. వీలైతే బిందుసేద్యం సదుపాయాన్ని ఏర్పాటు చేసుకోవాలి. నల్లటి పాలిథిన్ మల్చు కప్పడం వల్ల నేలలో తేమశాతం ఉంటుంది అలాగే కలుపు రాకుండా ఉంటుంది.



**అంతర కృషి :**

సాగులో కలుపు అనేది ప్రధాన సమస్య. ఎందుకంటే, అవికాంతి, నీరు, పోషకాల కోసం పంట మొక్కలతో పోటీ పడతాయి. అంతేగాక, పురుగులు తెగుళ్ళను వ్యాప్తి చేసేందుకు స్థావరాలుగా ఉంటాయి. కలుపు రాకుండా ఉండటానికి తరచుగా మట్టిని వదులు చేస్తూ వుండాలి. మల్చింగ్ వేసే ముందు, నాటడానికి ముందు కలుపు రాకుండా ఉండటానికి ఒకలీటరు ద్రావణానికి 2 మి.లీ. స్టాంప్‌తో నేలతడిచేలా పిచికారీ చెయ్యాలి.

**కొమ్మల కత్తిరింపు – శిక్షణ :**

హరిత గృహాలలో పెంచే టొమాటో మొక్కలకు నారు నాటిన 20 నుండి 25 రోజులలో స్టేకింగ్ తప్పనిసరిగా చెయ్యాలి. మొక్కను నిలువుగా ఉండే కొయ్యలపై దారంతో వదులుగా కట్టాలి. సకాలంలో స్టేకింగ్ చేసిన మొక్కలు మెరుగైన, నాణ్యమైన పండ్లని ఇస్తాయి. ప్రతి మొక్కకు ఒక ప్రధాన కాండమును ఉంచి మిగతా కొమ్మలను ఎప్పటికప్పుడు కత్తిరించాలి. ఈ ప్రక్కకొమ్మలను లేతదశలో గోరుతో గిల్లికూడా తొలగించవచ్చు. ఎదిగే మొక్క ప్రధాన కాండాన్ని ప్రక్కనే ఉన్న వదులైన ప్లాస్టిక్ దారానికి సవ్య దిశలో క్రింది నుంచి పైకి చుడుతూ పోవాలి. మొక్కలను నిర్దిష్ట వ్యవధిలో ప్రక్క కొమ్మలు కత్తిరించి శిక్షణనిస్తే నాటిన తర్వాత 10–11 నెలల వరకు పూత కాయల నిస్తాయి. మొక్క మొదలు భాగంలో ఉన్న కాయలు పరిపక్వ దశకు చేరేటప్పుడు దాని క్రింది భాగంలో ఉండే ముదురు ఆకులను తొలగించాలి. మొదటికోత అయిన తర్వాత, నేలను తాకిన ఆకులను తీసెయ్యాలి. గుత్తిలో ఎక్కువ సంఖ్యలో ఉన్న కాయలను తొలి దశలోనే గమనించి తొలగించాలి. ఇలా చెయ్యడం వలన గాలి ప్రసరణ బాగా జరిగి ముందుగా వచ్చే తెగుళ్లను తగ్గించవచ్చు.

**మొక్కల రక్షణ :**

హరిత గృహంలో వెచ్చని తేమ ఉండటం వల్ల పురుగుల ఉధృతి ఉంటుంది. కాబట్టి పురుగులను నివారించడానికి మట్టిని సారీకరణ చెయ్యడం, మల్చింగ్, ఫార్మాల్డిహైడ్‌తో ఫ్యూమిగేట్ చేయ్యాలి. తెల్లదోమ, నల్లి నులి పురుగులు హరిత గృహాలలో టొమాటోకు వచ్చే ప్రధాన చీడ పురుగులు. కూలీలు తరచుగా హరిత గృహంలో ప్రవేశించడం వల్ల వారితోపాటు పురుగులు కూడా లోపలికి వస్తాయి. 200 మైక్రాన్ మందం కలిగిన పాలిథిన్‌ను వాడాలి. డబుల్డోర్ ఎంట్రీ కోసం స్క్రీన్ పోయర్ను నిర్మించడం వల్ల గాలి ద్వారా లోనికివచ్చే కీటకాల సమస్యను కొంతవరకు తగ్గించవచ్చు. హరిత గృహం లోపలకు పురుగులు పోకుండా ప్రధానదృష్టి పెట్టాలి. నారును రక్షిత వాతావరణంలో

మాత్రమే పెంచాలి. పాడైపోయిన లేదా దెబ్బతిన్న ఆకులను తొలగించాలి. హరిత గృహాలలో రసంపీల్చే పురుగులు నియంత్రణ కోసం పసుపు స్టిక్కీకార్డ్ (8" ×12")ను ప్రతి 100 చదరపు మీటరుకు ఐదు ఉంచాలి. మొక్కపైన 4" నుంచి 6" వరకు పసుపు స్టిక్కీ కార్డులు/ట్రాప్‌లను స్ట్రింగ్స్ సాయంతో పంటలో వేలాడ దీయాలి. అప్పుడు పంట పెరిగే కొద్దీ, కార్డు కూడా పైకి వెళ్తుంది. కార్డుపై 60 నుండి 70 కంటే ఎక్కువ కీటకాలుఉన్నప్పుడు కార్డుని మార్చాలి. చీడలు, తెగుళ్ళను సమర్థవంతంగా నివారించడానికి, సమగ్ర సస్యరక్షణ పద్ధతులు పాటించాలి. నల్లుల నివారణకు డైకోఫోల్ 2 మి. లీ. ప్రతి లీటరు నీటికి చొప్పున పిచికారీ చెయ్యాలి. తెల్ల దోమ నివారణకు 1 మి.లీ ట్రైజోఫాస్‌ను 3 లీటర్ల నీటిలో కలిపి పిచికారీ చేయాలి. శిలీంధ్ర తెగుళ్ల నివారణకు 1 గ్రాము కార్బెండిజమ్, 1 గ్రాము మాంకోజెబ్ మిశ్రమాన్ని లీటరు నీటికి కలిపి పిచికారీ చేయాలి.

**పరాగ సంపర్కం :**

టొమాటో స్వీయ పరాగ సంపర్క పంట కాబట్టి, ఎండ వాతావరణంలో సాధారణంగానే పూత రావడం, కాయ రావడం జరుగుతుంది. అయితే పొగమంచు లేదా మేఘావృత వాతావరణంలో నాణ్యమైన కాయ రావడానికి, ఎలక్ట్రిక్ వైబ్రేటర్లు లేదాఎయిర్ బోయర్లు లేదా మాన్యువల్ షేకింగ్‌ను రోజులో 10 నుంచి 11 గంటల మధ్య మధ్యాహ్నం 2 నుంచి 3 గంటల సమయంలో చేపట్టాలి.

**పంట కోత :**

కాయలు ఏకరీతిగా పక్వానికి వస్తాయి. వాతావరణ పరిస్థితినిబట్టి మొదటి కాయ కోత, నాటిన 75 నుండి 80 రోజులలో మొదలై, 270 నుండి 300 రోజుల వరకు కొనసాగుతుంది. టొమాటోను సుదూరప్రాంతాలకు పంపించడానికి వీలుగా కాయలను ఆకుపచ్చ రంగు దశలో గాని లేదా రంగు మారే దశలో గాని కోయాలి. స్థానిక మార్కెట్లకు అయితే కాయ గులాబీ రంగు దశలోఉన్నప్పుడు కోయాలి. అదే ప్రాసెసింగ్ కోసం అయితే పండిన ఎరుపు రంగు టొమాటోను కోయాలి.

**సగటు దిగుబడి :**

కాయ సగటు బరువు సుమారు 7 నుండి 8 గ్రాములు వుంటుంది. ప్రతి మొక్కకు సుమారుగా 3 నుండి 4.5 కిలోల కాయలు కాస్తాయి. హరిత గృహాలలో సగటున 1000 మీటరు 2 స్థలానికి 9 నుండి 11 టన్నుల పండ్ల దిగుబడి వస్తుంది. దిగుబడి అనేది వాతావరణ పరిస్థితులు, అంతరకృషిపై కూడా ఆధారపడి ఉంటుంది.

**మార్కెట్ :**

దేశీయంగా అభివృద్ధి చేసిన ఈ పూసా గోల్డెన్ చెర్రీ టొమాటో-2 ఆకర్షణీయమైన రంగుతోపాటు పోషకాలను కలిగి ఉండడంతో ఈ రకానికి మార్కెట్లో మంచి డిమాండ్ ఉంది. ఆరోగ్య భద్రతకు ఈ రకం ఎంతో శ్రేయస్కరం. అందువలన సాధారణ మార్కెట్ కంటే ప్రీమియం మార్కెట్లో వీటికి మంచి ధర లభిస్తుంది. అంతేకాకుండా ఈ రకాన్ని ఎండబెట్టి టొమాటో రెసిన్లుగా అమ్మవచ్చు. ఇది మరొక ఉపయోగం. ఈ పసుపురంగు టొమాటో ప్రీమియం కిలో ధర 500 నుంచి 600 వరకు ఉంది. ఈ రకమైన ధరలు రైతుకు మంచి దిగుబడిని అందిస్తుంది అనడంలో సందేహం లేదు.

# పెంచిన ఎరువుల ధరలు తక్షణమే తగ్గించాలి : ఎఐకెఎస్




పెంచిన డి-అమ్మోనియం పాస్ఫేట్ (డిఎపి), నైట్రోజన్ పాస్ఫరస్ పొటాష్ (ఎన్‌పికె) ఎరువుల ధరలను తక్షణమే ఉపసంహరించుకోవాలని ఎఐకెఎస్ డిమాండ్ చేసింది. ఈ మేరకు మంగళవారం ఒక ప్రకటనను ఎఐకెఎస్ అధ్యక్షులు అశోక్ దావలే, హన్నన్ మొల్లా విడుదల చేశారు. ధరలు పెరుగుదలతో రైతాంగం పట్ల ప్రధానికి ఉన్న 'ప్రేమ' బహిర్గతమైందని ప్రకటనలో విమర్శించారు. 50 కిలోల డిఎపి బ్యాగ్‌పై రూ.150, అదే పరిమాణంలో ఉన్న ఎన్‌పికె బ్యాగ్‌పై 285 పెంచారు. ఇప్పటికే ఉన్న డీజిల్, పెట్రోల్, విత్తనాలు, పురుగుమందుల వంటి ఇతర ఇన్‌పుట్ ఖర్చుల పెరుగుదలతో పాటు ఈ ఎరువుల ధరల పెరుగుదల-వ్యవసాయాన్ని లాభదాయకంగా మార్చడానికి కాదని, రైతులను వారి భూమి నుంచి వేరుచేయడానికి పాలకవర్గ అజెండాలో భాగమని ఆరోపించారు. నయా-ఉదారవాద నమూనా ఫలితంగా ఎరువులను ఉత్పత్తి చేసే ప్రభుత్వరంగ యూనిట్లను (పిఎస్‌యులను) క్రమపద్ధతిలో నిర్వీర్యం చేయడంతో ఎరువుల ఉత్పత్తిలోకి ప్రైవేట్ పెట్టుబడి పెరిగిందన్నారు. ఎరువులను సకాలంలో, తగినన్ని ఏర్పాటు చేయడంలో మోడీ పాలన విఫలం చెందిందన్నారు. రైతు వ్యతిరేక ఎరువుల విధానంతో బిజెపి ప్రభుత్వం ముందుకు సాగడం ద్వారా ఆహార భద్రతతో పాటు దేశ జాతీయ భద్రతపై రాజీపడటం విడ్డూరమని క్రమబద్ధీకరించని, ప్రైవేటీకరించబడిన ఎరువుల రంగంలో పెట్టుబడిదారులకు బ్లాక్ మార్కెటింగ్, పెద్దఎత్తున నిల్వలకు అనుకూలమైన వాతావరణాన్ని కూడా మోడీ ప్రభుత్వం సృష్టిస్తోందని పేర్కొన్నారు.

సరైన ధరలకు, తగినంతగా ఎరువులను సరఫరా చేయడం భారతదేశ ఆహార భద్రతకు కీలకమని తెలిపారు. బిజెపి ప్రభుత్వం ఈ ఎరువుల ధరలను నమ్మశక్యం కాని రీతిలో పెంచి రైతులను అపహాస్యం చేస్తోందన్నారు. డిఎపి ధర రూ.2009-10లో టన్నుకు రూ.9,350 ఉండగా, ఇప్పుడు రూ.27,000కు చేరుకుందన్నారు. నిజమైన దేశభక్తిని నిర్ధారించడానికి ఎరువుల ధరలను తక్షణమే ఉపసంహరించుకోవాలని ఎఐకెఎస్ డిమాండ్ చేసింది. అలాగే మోడీ పాలనలో ఈ రైతు వ్యతిరేక చర్యను నిరసిస్తూ హర్యానాలో వీధుల్లోకి వచ్చిన రైతులకు ఎఐకెఎస్ అభినందనలు తెలిపింది.

# పూసా రౌనక్ - వేసవిలో అధిక దిగుబడినిచ్చే టిండా

వేసవిలో అధిక దిగుబడినిచ్చే కూరగాయ పంటలలో రౌండ్ మెలాన్ ఒకటి. దీనినే స్క్వాష్ మెలాన్, ఇండియన్ స్క్వాష్, టిండా అని కూడా పిలుస్తారు. ఇది ఉత్తర భారతదేశంలో, ముఖ్యంగా పంజాబ్, హర్యానా, ఢిల్లీ, పశ్చిమ ఉత్తరప్రదేశ్, మహారాష్ట్ర, గుజరాత్, రాజస్థాన్లలో అత్యంత ప్రాచుర్యం పొందింది. ఈ కూరగాయ వల్ల చాలా ఉపయోగాలు ఉన్నాయి. వండుకోవచ్చు, ఉడకబెట్టుకోవచ్చు, వేయించుకోవచ్చు, ఊరగాయగానూ చేసుకోవచ్చు, విత్తనపు పొరను తొలగించిన విత్తనాలను వేయించి తినవచ్చు. పచ్చని రంగు కల్గిన లేతకాయలను వంటకు వుపయోగిస్తారు. ఇందులో 93 శాతం నీరు ఉంటుంది. అంతేకాకుండా వీటిలో కార్బోహైడ్రేట్లు, ప్రోటీన్, కాల్షియం, భాస్వరం, విటమిన్-ఎ, విటమిన్ -సి ఉంటాయి. ఇందులో ఔషధ విలువలు లేకపోలేదు. పొడిదగ్గును తగ్గిస్తుంది. శరీరంలో రక్త ప్రసరణను మెరుగు పరుస్తుంది. అలాగే శరీరానికి చల్లదనాన్ని ఇస్తుంది.

స్వల్పకాలిక వ్యవధి, పచ్చని రంగు, తెల్లటి గుజ్జు, తక్కువ విత్తనాలు, మెరుస్తూ ఉండే, గుండ్రటి ఆకారం, ఒకేలా ఉండే అధిక దిగుబడులను ఇచ్చే రౌండ్ మెలాన్ కోసం శాస్త్రవేత్తలు చేసే ప్రయత్నంలో ఒక కొత్త రకం ఆవిర్భవించింది. అదే 'పూసా రౌనక్' (డిఎంఆర్-26). ఈ రకాన్ని 2015-16లో కూరగాయల విభాగం, భారతీయ వ్యవసాయ పరిశోధన సంస్థ, న్యూఢిల్లీ వారు రూపొందించారు.


**మోటపలుకుల జ్యోతి,**
పి. హెచ్.డి. స్కాలర్, ఉద్యాన విభాగం
వసంత్రావ్ నాయక్ మరఠ్వాడ వ్యవసాయ విశ్వవిద్యాలయం, పర్భాని, మహారాష్ట్ర.
**అమిష్ కె సురేజా,**
శాస్త్రవేత్త, కూరగాయల విభాగం
ఐ.సి.ఏ.ఆర్-భారతీయ వ్యవసాయ పరిశోధన సంస్థ, పూసా, న్యూఢిల్లీ.




తీగ మీటరు నుంచి మీటరున్నర పొడువు ఉంటుంది. కాయ పచ్చగా ఉండి మెరుస్తూ, గుండ్రని ఆకారాన్ని కలిగి ఉంటుంది. కాయపైన మెత్తటి సన్నని వెంట్రుక నిర్మాణం ఉంటుంది. ఒక్కో కాయ సరాసరి బరువు 60 గ్రాములు ఉంటుంది. గుజ్జు తెలుపు రంగులో ఉంటుంది. తక్కువ విత్తనాలను కలిగి ఉండడం వలన వంటకు బాగా ఉపయోగపడుతుంది. 55 నుంచి 60 రోజులకు కోతకు వస్తుంది. వేసవి సాగులో హెక్టారుకు 7. 5 టన్నులను పొందవచ్చు. 2011 నుంచి 2015 వరకు జరిపిన పరిశోధనలో తేలిన విషయం ఏమిటంటే బాగా ప్రాచుర్యం పొందిన పంజాబ్ టిండా రకం కన్నా పూసా రౌనక్ అధిక దిగుబడిని ఇస్తుంది.

### సాగుచేసే విధానం

ఈ రకం సాగుకు అన్ని రకాల నేలలు అనుకూలం. సారవంతమైన నేలలు మంచి దిగుబడిని ఇస్తాయి. హెక్టారుకు 4 నుంచి 5 కిలోల విత్తనం సరిపోతుంది. వేసవి సాగు కోసం ఫిబ్రవరి రెండవ వారం నుంచి మార్చి మొదటివారం అనుకూలం. రెండు మొక్కల మధ్య 45 సెంటిమీటర్ల దూరం ఉండేలా నాటుకోవాలి. సాళ్ల మధ్య దూరం 1.5 నుంచి 2.5 మీటర్లు ఉండాలి. ప్రతి రంధ్రంలోనూ రెండు లేదా మూడు విత్తనాలను 2 సెంటీమీటర్ల లోతులో విత్తుకోవాలి. హెక్టారుకు 15 నుంచి 20 టన్నుల బాగా కుళ్ళిన సేంద్రియ ఎరువును సాగుకు ముందు పొలంలో చల్లుకోవాలి. 50 కిలోల యూరియా, 120 కిలోల సింగల్ సూపర్ ఫాస్పేట్ యూరియా, 60 కిలోల మ్యురేట్ ఆఫ్ పొటాష్‌ను చివరి దుక్కులో వేసుకోవాలి. నాటిన 30, 45 రోజులకు, మరో 50 కిలోల యూరియాను అందించాలి. మొక్క ఎదిగే దశలో కాయ పెరిగే దశలో 1 శాతం యూరియా ద్రావణాన్ని మొక్కలపైన పిచికారీ చేసుకోవాలి. మొక్కలు 8 నుంచి 10 సెంటీ మీటర్ల ఎత్తులో ఉన్నప్పుడు కేవలం ఒకటి లేదా రెండు మొక్కలను మాత్రమే ఉంచి మిగతావాటిని పీకేయాలి.

### తెగుళ్లు, చీడల నిర్వహణ

ఆకులను, కాయలను నష్టం చేసే పురుగులు, వ్యాధుల నుంచి పంటను కాపాడుకోవాలి. లేదంటే పంట దిగుబడి తగ్గే అవకాశముంది. ఎర్రటి గుమ్మడికాయ బీటిల్ ఆకులను తినేస్తుంది. దీని నివారణకు 20 ఈసికార్బో సల్ఫాన్ 2 గ్రాములు లీటరు నీటిలో కలిపి పిచికారీ చెయ్యాలి. పండు ఈగ లేత కాయలపై గుడ్లు పెడుతుంది. దాని మాగ్గోట్ కాయ కండను తినేస్తుంది. దానివల్ల కాయలు వాటి ఆకారాన్ని కోల్పోతాయి. ఈ పురుగు ఆశించిన కాయలను వెంటనే తెంపేసి దూరంగా పడెయ్యాలి. పండు ఈగని నివారించడానికి 2 మిల్లీలీటర్ల మలాథియాన్‌ను లీటరు నీటికి కలిపి పిచికారీ చెయ్యాలి లేదా విషపు ఎరనుగాని లేదా లింగాకర్షక బుట్టలనుగాని ఉపయోగించి నియంత్రించాలి. రసం పీల్చే పురుగుల నివారణకు 0.3 మీల్లీలీటర్ల ఇమిడాక్లోప్రిడ్ లేదా 0.3 గ్రాముల ఎసిటామిప్రిడ్‌ఖు లీటరు నీటిలో కలిపి పిచికారీ చెయ్యాలి. రెండు వారాల విరామం తర్వాత 2 మిల్లీ లీటర్ల డిమిక్రోన్‌ను లీటరు నీటిలో కలిపి పిచికారీ చెయ్యాలి.

వేసవిలో కురిసే అధిక వర్షాలకు బూడిద తెగులు వస్తుంది. ఈ తెగులు ఆశించిన ఆకుల పైభాగాన ఎరుపు గోధుమ రంగు మచ్చలు, ఆకుల దిగువ భాగాన నలుపు, బూడిద రంగు మచ్చలు కనిపిస్తాయి. దీని నివారణకు 2 గ్రాముల డైథెన్ ఎమ్-45 ను లీటరు నీటిలో కలిపి 10 రోజుల విరామంలో రెండుసార్లు పిచికారీ చెయ్యాలి. ఫ్యూసరియం తెగులు ఆశించిన నారు వడలి పోతుంది. అంతేగాక ఈ తెగులు ఆశించిన మొక్కలు ఒక్కసారిగా ఎండిపోయి, పసుపు రంగు లేదా గోధుమ రంగులోకి మారుతాయి. దీని నివారణకు 2 గ్రాముల క్యాప్టాఫ్‌ను లీటరు నీటిలో కలిపి మట్టి పంట వేర్లు తడిచేలా 10 రోజుల కోసారి స్ప్రే చెయ్యాలి.

ఇలా సస్య రక్షణ పద్ధతులు చేపట్టి పంటను కాపాడు కోగలిగితే మంచి ఆదాయాన్ని పొందవచ్చు. అలాగే పోషకాలు కల్గిన ఇలాంటి కూరగాయలు ఆహారంలో చేర్చుకోవడం ఎంతో ముఖ్యం.

## ఓ వేకువ చుక్క కొలిగింది

**- కనుమ ఎల్లారెడ్డి**

సాయుధ రైతాంగ పోరాటంలో
వేకువ చుక్కలా వెలిగింది
ప్రజా చైతన్యం ఆమెలో కలిసింది
సాహసమే ఆమె ఊపిరి
కష్టజీవి సంక్షేమమే ఆమె దారి
ఎత్తిన పిడికిళ్లు
ఛేధించాయి సంకెళ్లు
అరుణ పతాకమే పేదలకు అసరా

అరుణ పతాకయే పేదలకు వరంరా
అరుణ బాటలో సాగుదాం
భవిష్యత్తు మార్చుకుందాం
ఆమె కంఠం నుంచొచ్చిన ఓ విప్లవ గేయం
అందరికి కలుగు సూర్యోదయం
ఆమె ధైర్యం
ఆమె సాహసం
ఆమె స్ఫూర్తి

రైతాంగానికే ఓ కరదీపిక
ఓ అరుణతార
ఓ వేకువ చుక్క నింగికెగిసింది
నా గుండె చప్పుడు మీరేనంటూ
నింగిలో అరుణ పతాక
రెపరెపలాడిస్తోంది

(మల్లు స్వరాజ్యంకు నివాళిగా)

# వేసవిలో బీర సాగు



కె.సరిత, శాస్త్రవేత్త (ఉద్యాన విభాగం)
కె.రాహుల్ విశ్వకర్మ (కో ఆర్డినేటర్)
ఏరువాక కేంద్రం, సంగుపేట, సంగారెడ్డి జిల్లా

వేసవిలో కూరగాయలకు మంచి డిమాండ్ ఉంటుంది. ముఖ్యంగా తీగజాతి కూరగాయలు అయిన బీర, సొర, దోస వంటి పంటలకు డిమాండ్ అధికం. నీటి వసతి కలిగిన రైతులు బీరను వేసవి పంటగా సాగు చేసుకోవచ్చు. ప్రస్తుతం ఉన్న వేడి వాతావరణ పరిస్థితులకు మొక్క ఎదుగుదల తక్కువగా ఉండి, చీడపీడలు ఎక్కువగా ఆశిస్తాయి. కాబట్టి తగిన యాజమాన్య పద్ధతులు పాటిస్తే అధిక దిగుబడులతో పాటు మంచి ఆదాయాన్ని పొందవచ్చు.

**వాతావరణం :** తేమతో కూడిన వేడి వాతావరణం వీటి సాగుకు అనుకూలం. ఉష్ణోగ్రత 25-30 డిగ్రీల సి ఉంటే తీగ పెరుగుదల బాగా ఉండి, పూత, పిందె బాగా పడుతుంది. తీగ మొదటి పెరుగుదల దశలో వేడి ఎక్కువగా ఉంటే మగ పూలు ఎక్కువగా వస్తాయి.

రెండు ఆకుల దశలో 3 గ్రాముల బోరాక్స్ / లీటరు నీటికి కలపి పిచికారీ వారం వ్యవధిలో రెండు సార్లు చేసినట్లయితే ఆడపూలు ఎక్కువగా వస్తాయి.

**నేలలు :** ఇసుకతో కూడిన గరప నేలలు, లేదా నీరు నిలుపుకునే బంక మట్టి నేలలు అనుకూలం. ఉదజని సూచిక 6.0-7.0 మధ్య ఉన్న నేలలు, మురుగునీటి సౌకర్యంగల ఒంపు నేలలు అనుకూలం.

**రకాలు :** జగిత్యాలలాంగ్, జైపూర్ లాంగ్, అర్క సుజిత్, అర్క సుమిత్, అర్క ప్రసన్, పూసనస్దర్

**సంకరజాతి రకాలు :** సురేఖ, సంజీవిని, మహిమ, యుఎస్-401, యుఎస్-403, అర్జున్, లతిక, నాగ, మల్లిక, అర్క విక్రమ్

**విత్తే సమయం :** వేసవి పంటకు డిసెంబరు రెండో పక్షం నుంచి జనవరి రెండో పక్షం వరకూ విత్తుకోవాలి

**విత్తన మోతాదు :** 600- 800 గ్రాముల విత్తనం ఎకరానికి సరిపోతుంది.

**విత్తనశుద్ధి :** ఇమిడాక్లోప్రిడ్ 5 గ్రాములు కిలో విత్తనానికి పట్టించి ఆ తరువాత ట్రైకోడెర్మా విరిడే 4 గ్రాములు కిలో విత్తనానికి లేదా థైరమ్ లేదా కాప్టాన్ పొడి మందు కలిపి విత్తనశుద్ధి చేస్తే చీడపీడలను తట్టుకుంటుంది.

**నేల తయారీ :** పొలాన్ని మూడు నాలుగు సార్లు బాగా దున్ని ఆఖరి దుక్కిలో పశువుల ఎరువు 6-8 టన్నులు ఎకరానికి వేసి కలియ దున్నాలి. 60-80 సెంటీమీటర్ల దూరంలో కాలువలు వేసుకోవాలి. రెండు కాలువల మధ్య దూరం 2 మీటర్లు ఉండేలా చూసుకోవాలి.

**విత్తే పద్ధతి :** రెండు పాదుల మధ్య దూరం వేసవి పంటకయితే 50 సెంటీమీటర్ల దూరం ఉండేలా చూసుకోవాలి.

వేసవిలో అధిక ఉష్ణోగ్రత వల్ల మొక్క పెరుగుదల తక్కువగా వుండి, పూత, పిందె తగ్గి దిగుబడులు తగ్గుతాయి. అందువల్ల మొక్కలను తక్కువ దూరంలో నాటుకొని మొక్కల సాంద్రత పెంచితే, విడిగా మొక్క దిగిబడి తగ్గినప్పటికీ, ఎక్కువ మొక్కలుండటం వల్ల విస్తీర్ణంలో దిగుబడి తగ్గకుండా ఉంటుంది. ఇందుకోసం విత్తన మోతాదు పెంచాలి.

**ఎరువుల యాజమాన్యం :** 24-32 కిలోల చొప్పున భాస్వరం, పొటాష్ నిచ్చే ఎరువులను బాగా కలిపి అన్ని గుంతల్లో సమానంగా నింపాలి. నత్రజనిని 32-40కి ఎకరానికి చొప్పున రెండు భాగాలుగా చేసి ఒక భాగం విత్తిన 20-25 రోజులకు, రెండో భాగం 50-60 రోజులకు వేసి నీరు కట్టాలి. ఎరువులను మొక్కకు 10-15 సెంటీమీటర్ల దూరంలో వేసి మట్టి ఎగదోసి నీరు పారించాలి.



**అంతరకృషి :** కలుపు మొక్కలను ఎప్పటికప్పుడు తీసి వేయాలి. లేదా గింజలను విత్తిన రెండు మూడు రోజుల్లో పెండిమిథాలిన్ ఒక లీటరు, 200 లీటర్ల నీటిలో కలిపి తడి నేలపై పిచికారి చేయాలి. దీనివల్ల 30 రోజుల వరకు కలుపురాదు. ఆ తరువాత 45 రోజులకొకసారి పాదు చుట్టూ తేలికగా మట్టిని గుల్ల చేసి మొక్క దగ్గరకు ఎగదోయాలి. పొడవు బీర రకాలకు పందిరి తప్పనిసరి.

**కోత :** రకాన్ని బట్టి బీరకాయలు నాటిన 60-90 రోజుల్లో కోతకు వస్తాయి. కాయలు లేతగా ఉన్నప్పుడు కోయాలి. కాయలు ముదిరిపోకుండా రెండు మూడు రోజుల వ్యవధిలో కోయాలి.

**దిగుబడి :** 6-8 టన్నులు / ఎకరానికి సాధించవచ్చు.

### పురుగులు / తెగుళ్లు

**బూడిద తెగులు :** ఈ సమయంలో (ఫిబ్రవరి- మార్చి)లో ఈ బూడిద తెగులు ఎక్కువగా ఆశించడానికి ఆస్కారం ఉంటుంది. లేత ఆకులకన్నా దాదాపు 20 రోజుల వయస్సున్న ఆకులపై ఈ తెగులు ఎక్కువగా ఆశిస్తుంది. ఈ తెగులు నివారణకు 1 మిల్లీలీటరు డైనోకాప్ లీటరు నీటికి కలిపి పిచికారి చేసుకోవాలి.

**పండు ఈగ :** పూత దశలో తల్లి ఈగల పువ్వులపై గుడ్లను పెడతాయి. ఇవి పూత, పిందెల్లోకి చేరి కాయలను తిని నష్టపరుస్తాయి. దీని నివారణకు పూత, పిందె దశలో ఎరలను ఒక ఎకరానికి 4-6 చొప్పున అమర్చితే తల్లి ఈగలు ఎరలో పడి చనిపోతాయి.

కూరగాయల్లో సమగ్ర సస్యరక్షణలో భాగంగా వేప నూనె 5 మిల్లీ లీటర్లను లీటరు నీటికి కలిపి పిచికారీ చేసుకోవాలి. తప్పనిసరి పరిస్థితుల్లో రసాయనాలను పిచికారీ చేస్తే, 10 రోజుల తర్వాత కోతలు చేపట్టాలి. వేసవిలో కాయలలో వచ్చే చేదు నివారణకుగాను కోతకు రెండు రోజుల ముందు నీటి తడి ఇచ్చి కోత చేపడితే చేదును నివారించొచ్చు.

పైన చెప్పిన విధంగా తగిన యాజమాన్య పద్ధతులు పాటిస్తే రైతులు అధిగ దిగుబడులు సాధించొచ్చు.



# వేరుశనగ పంట అవశేషాల వినియోగం


**కేతావత్ నరేష్**
(పి.హెచ్.డి. రీసెర్చి స్కాలర్)
ఎస్.కె.యు.ఎ.ఎస్.టి. కశ్మీర్


వేరుశనగ సాగు చేసే రైతులు వాతావరణంలో వస్తున్న పెను మార్పులను గమనించి రైతాంగం వ్యవసాయ పద్ధతులను మార్చుకోవాలి. పంటల్లో గింజలు, అవశేషాలు, ఉత్పత్తవుతున్నాయి. వీటి నుండి ఎంతో విలువైన ఉప ఉత్పత్తులను, విలువ ఆధారిత ఉత్పత్తులను తయారు చేసి విక్రయించడం ద్వారా అధిక నికర లాభం పొందవచ్చు. వ్యవసాయానికి పాడి, కోళ్లు, గొర్రెలు పెంపకం మంచి అనుబంధ వ్యాపకాలు. సమగ్ర వ్యవసాయం చేపట్టి, పంట అవశేషాలను ఆధునిక పద్ధతుల్లో విలువలు జోడించిన మేతగా తయారు చేసుకొని వాడుకోవచ్చు. వ్యవసాయంలో ఏదీ వృథా కాదు. వేరుశగన అవశేషాలను దిగువ విధ:గా సద్వినియోగం చేసుకోవాలి.

**వేరుశనగ :** హెక్టారుకు 16 క్వింటాళ్ల కాయల దిగుబడి, 7.5 టన్నుల పల్లి కట్టె వస్తుంది. వేరుశనగ గింజలను గానుగ పట్టించినప్పుడు 35 శాతం నూనెం, 65 శాతం చెక్క వస్తుంది. నూనెను వంటకు, శాఖాహార నెయ్యిగా తయారు చేస్తారు. చెక్కలో 43-65 శాతం మాంసకృత్తులు, 6.25 శాతం కొవ్వులు, బి.విటమిన్ కలిగి ఉండటం మూలాన పశువులకు బలమైన దాణాగా వినియోగిస్తారు. శనగకాయలు వలిస్తే 25 శాతం పొట్టు వస్తుంది. ఈ పొట్టును ఇటుకలుగా చేసి విద్యుదుత్పత్తిలో ఇటుక బట్టీలు కాల్చడానికి తద్వారా వచ్చిన బూడిదను సిమెంట్ తయారీలో వాడతారు. కొంత భాగాన్ని పశువుల, కోళ్ల దాణాగా వాడతారు. వేరుశనగ కాయలు/పల్లి కట్టె పశువులకు, గొర్రెలకు మంచి మేతగా వుపయోగిస్తారు.

వేరుశనగ గింజలను వేయించి/ఉడికించి, రకరకాల అల్పాహారాల్లో కలిపి సేవిస్తారు. బెల్లం పానకంతో పట్టీలు తయారు చేస్తారు. వీటిని రక్తహీనత నివారిణిగా, క్యాన్సర్ నిరోధానికి, హృద్రోగ వ్యాధి నిరోధానికి వాడతారు.

# ఉద్యోగం వదిలి పొలంబాట పట్టి

- పచ్చవ బుజ్జిబాబు, నరసరావుపేట






ఐదంకెలలో వస్తున్న జీతం.. ప్రశాంతమైన జీవితం.. ఆ యువకుడికి సంతృప్తి నివ్వలేదు. పలువురికి ఆదర్శంగా నిలవాలని ఒక్కరికైనా ఉపాధి అవకాశం కల్పించాలనే ఆలోచనలు అతణ్ణి వ్యవసాయ రంగం వైపు మళ్లించాయి. ఫలితంగా పలురకాల పండ్ల తోటలు సాగు చేసి లాభాలు ఆర్జిస్తున్నారు. ఉద్యోగం వదిలి వ్యవసాయం ఏమిటి అని వ్యంగ్యంగా మాట్లాడిన వారే ఔరా అని ముక్కున వేలేసుకునేలా పండ్ల తోటలు సాగు చేపట్టి పలువురు రైతులకు, యువజనులకు ఆదర్శంగా నిలిచారు యేరువ కోటిరెడ్డి.

గుంటూరు జిల్లా నసరావుపేట మండలం అల్లూరివారిపాలెం గ్రామానికి చెందిన యేరువ కోటిరెడ్డి 2014లో ఇంజనీరింగ్ పూర్తి చేసి ప్రముఖ కంపెనీలో ఉద్యోగం సాధించాడు. రైతు బిడ్డ అయిన కోటిరెడ్డి ఉద్యోగం చేస్తున్నప్పటికీ వ్యవసాయ రంగంపై ఉన్న మక్కువతో ఆ వైపు ఆలోచనలు చేశాడు. మొదట్లో విషయం ఇంట్లో చెప్తే తల్లిదండ్రులు ఒప్పుకోకపోవడంతో సాఫ్ట్‌వేర్ బాటలో 2018 వరకు కొనసాగారు. ఉద్యోగం చేస్తూ సెలవు రోజుల్లో తెలంగాణ రాష్ట్రంలో అక్కడక్కడా సాగు చేస్తున్న పండ్లతోటల పెంపకం దారులతో మాట్లాడేవారు. తోటల సంరక్షణ గురించి తెలుసుకోవడం ప్రారంభించారు.

తనదైన శైలిలో రసాయన ఎరువులు క్రిమి సంహారక మందులు వినియోగించని వ్యవసాయం ద్వారా పలు రకాల పండ్ల తోటలను పెంచాలనుకున్నారు. వెంటనే తమకున్న పొలంలో పంట సాగు చేసి ఆరోగ్యంగా ఉండాలని నిర్ణయించుకున్నాడు. ఉద్యోగాన్ని వదిలి తన గ్రామంలో తమకున్న 4.5 ఎకరాల వ్యవసాయ భూమిలో ఒక వైపు సాగు నీటికై బావి తవ్వించి సోలార్ మోటారు డ్రిప్పు పద్ధతి ఏర్పాటు చేశారు. మరో 1.5 ఎకరాను కౌలుకు తీసుకుని మొత్తం 6 ఎకరాలలో అరటి, బొప్పాయి, జామ, సీతాఫలం పంటలను సాగు చేపట్టాడు. తన ఉత్పత్తుల అమ్మకాలకు దళారుల ప్రమేయం లేకుండా స్వయంగా నరసరావుపేట, రొంపిచర్ల రోడ్డులోగల పొలం దగ్గరే వినియోగదారులకు విక్రయిస్తూ అధిక లాభాలు గడిస్తున్నారు. పండ్ల తోటలకు ముందు చామంతి, మొక్కజొన్న, సన్ ఫ్లవర్ తోటలు వేసి అధిక లాభాలు పొందారు. ఈ ఏడాది వేసిన పండ్ల పంటలలో అంతర పంటల విధానం పాటిస్తున్నారు. అదేవిధంగా పలుచోట్ల జరిగే వ్యవసాయ తరగతులకు హాజరవుతూ సామాజిక మాధ్యమాల ద్వారా కొన్ని మెలకువలు నేర్చుకుని పశువుల ఎరువు ద్వారా పంటలు సాగు పూర్తిగా సేంద్రియ పద్ధతిలో పెంచుతున్నానని తెలిపారు. తన పుత్పత్తులకు వినియోగదారుల నుండి లభించిన గుర్తింపు తనకు సంతృప్తినిచ్చిందని ఆనందం వ్యక్తం చేస్తున్నారు.

## మిర్చి రైతులను ఆదుకోవాలి : మధు

**నాగులుప్పలపాడు (ప్రకాశం) :** మిర్చి రైతులను ఆదుకోవాలని, శనగలను ప్రభుత్వమే కొనుగోలు చేయాలని మాజీ ఎంపి పి.మధు డిమాండ్ చేశారు. రైతాంగాన్ని ఆదుకోవాలని డిమాండ్ చేస్తూ ప్రకాశం జిల్లా నాగులుప్పలపాడు మండలంలోని ఉప్పుగుండూరు గ్రామంలో పాదయాత్ర చేపట్టి, సభ నిర్వహించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ.. జిల్లావ్యాప్తంగా లక్ష ఎకరాల్లో మిర్చి పంట సాగు చేశారన్నారు. అయితే అధిక వర్షాలు, తామర తెగుళ్లతో 70 శాతం పంటను తొలగించారని ఆవేదన వ్యక్తం చేశారు. రైతులను ఆదుకోవడంలో ప్రభుత్వాలు పూర్తిగా విఫలమయ్యాయన్నారు. మిర్చి రైతులకు ఎకరానికి రూ.50 వేలు నష్టపరిహారం అందజేయాలని డిమాండ్ చేశారు. కొత్త తెగుళ్లతో శనగ పంట దిగుబడి గణనీయంగా తగ్గుతోందన్నారు. సభకు కౌలురైతు సంఘం




జిల్లా నాయకులు జె.జయంతిబాబు అధ్యక్షత వహించారు. కార్యక్రమంలో రైతుసంఘం జిల్లా అధ్యక్ష, కార్యదర్శులు పెంట్యాల హనుమంతరరావు, పమిడి వెంకట్రావు, కౌలురైతు సంఘం జిల్లా కార్యదర్శి వి.బాలకోటయ్య, రైతులు పాల్గొన్నారు.




### ధాన్యం బకాయిలు చెల్లించాలని ధర్నా

**పెంటపాడు :** ధాన్యం బకాయిలు వెంటనే చెల్లించాలని డిమాండ్ చేస్తూ పశ్చిమ గోదావరి జిల్లా పెంటపాడు తహశీలు వద్ద కౌలు రైతులు ధర్నా నిర్వహించారు. ధాన్యం బకాయిలు చెల్లింపుల పట్ల ప్రభుత్వం నిర్లక్ష్య వైఖరి నశించాలని నినాదాలు చేశారు. ధాన్యం అమ్మి మూడు నెలలైనా బకాయిలు చెల్లించకపోవడంపై కౌలు రైతులు ఆగ్రహం వ్యక్తం చేశారు. ఈ సందర్భంగా ఎపి రైతు సంఘం జిల్లా కార్యదర్శి కె.శ్రీనివాస్, ఉపాధ్యక్షుడు చిర్ల పుల్లారెడ్డి, నాగేశ్వరరావు, నాగిరెడ్డి మాట్లాడారు. అలాగే ధాన్యం బకాయిలు చెల్లించాలని జిల్లా పౌరసరఫరాల అధికారికి కూడా వినతిపత్రం ఇచ్చారు.

### మిర్చి రైతులకు పరిహారమివ్వాలి

**చందర్లపాడు :** తెగుళ్లతో నష్టపోయిన మిర్చి రైతులకు పరిహారం ఇవ్వాలని కోరుతూ కృష్ణాజిల్లా చందర్లపాడు మండలం కొడవటికల్లులో రైతు సంఘ కార్యకర్తలు కరపత్రాలు పంపిణీ చేశారు. మిర్చిరైతులకు పరిహారంతోపాటు పంటల బీమా వర్తింపచేయాలని, కౌలు రైతులందరికీ ఇ-క్రాప్ నమోదు చేసి నష్టపరిహారం ఇవ్వాలని డిమాండ్ చేశారు. కౌలు రైతు సంఘం జిల్లా కార్యదర్శి చనమోలు సైదులు, సుబాబుల్ జామాయిల్ రైతు నాయకులు తుమ్మల నాగేశ్వరరావు, కందుల నాగేశ్వరరావు, గుమ్మళ్ల కొండలరావు తదితర నేతలు పాల్గొన్నారు.

### శనగలు, మినుములు మార్క్‌ఫెడ్ కొనుగోలు చేయాలి

**కడప :** రబీ సీజన్‌లో పండిన శనగలు, మినుములు, కందులు, పెసలను రైతు భరోసా కేంద్రాల ద్వారా తక్షణమే కొనుగోలు చేయాలని ఎపి రైతు సంఘం ఆధ్వర్యంలో కడపలో జిల్లా కలెక్టరును కలిసి వినతిపత్రం ఇచ్చారు. ఈ సందర్భంగా రైతు సంఘం జిల్లా ప్రధాన కార్యదర్శి బి.దస్తగిరిరెడ్డి మాట్లాడుతూ.. అపరాలను రైతులు అవసరాల రీత్యా ప్రయివేటు వ్యాపారులకు తక్కువ ధరకు అమ్ముకుంటున్నారని, ప్రభుత్వం ప్రకటించిన మద్దతు ధరలు శనగలకు రూ.5,230, మినుములకు రూ.6,300 రైతులు కోల్పోతున్నారని, కనుక ప్రభుత్వమే మద్దతు ధరలకు కొనుగోలు చేయాలని కలెక్టరుకు ఇచ్చిన వినతిపత్రంలో పేర్కొన్నారు. ఎపి రైతు సంఘం జిల్లా ఉపాధ్యక్షులు గోపాలకృష్ణయ్య కూడా పాల్గొన్నారు.

### వరి ధాన్యాన్ని కొనుగోలు చేయాలని వినతులు

**శ్రీకాళహస్తి :** వరి ధాన్యాన్ని రైతు భరోసా కేంద్రాల్లో కొనగోలు చేయాలని చిత్తూరు జిల్లా శ్రీకాళహస్తిలో ఎపి రైతు సంఘం ఆధ్వర్యాన వ్యవసాయ శాఖ అసిస్టెంట్ డైరెక్టర్‌కు వినతిపత్రం ఇచ్చారు. ఎపి రైతు సంఘం జిల్లా ప్రధాన కార్యదర్శి దాసరి జనార్ధన్ తదితర నాయకులు పాల్గొన్నారు. అలాగే విత్తన ధాన్యం సేకరించాలని కోరుతూ శ్రీకాళహస్తిలోని ఎపి సీడ్స్ మేనేజర్‌కు కూడా వినతిపత్రం ఇచ్చారు. దాసరి జనార్ధన్ తదితర నాయకులు పాల్గొన్నారు.

### చెరకు బకాయిలు చెల్లించాలని వినతి

**గోవాడ :** విశాఖ జిల్లా గోవాడ సుగర్ ఫ్యాక్టరీలో రైతులకు, కార్మికులకు చెల్లించాల్సిన పాత బకాయిలను వెంటనే చెల్లించాలని ఫ్యాక్టరీ ఎమ్‌డికి వినతిపత్రం ఇచ్చారు. అలాగే గోవాడ సూర్యాపేట లో కూడా పాత బకాయిలు చెల్లించాలని డిమాండ్ చేస్తూ చెరకు రైతులు ప్రదర్శన నిర్వహించారు.

### ఆత్మహత్యకు పాల్పడిన కౌలు రైతు కుటుంబానికి పరామర్శ

**తాడికొండ :** గుంటూరు జిల్లా తాడికొండ మండలం పాముల పాడులో మిర్చి, పత్తి పంటలు వేసి నష్టపోవడంతో ఆత్మహత్య చేసుకున్న కౌలురైతు లక్కా లక్ష్మీ హరికృష్ణ ఇంటికి వెళ్లి వారి భార్యను ఎపి రైతు సంఘం నేతలు పరామర్శించారు. వారి కుటుంబ సభ్యులకు సానుభూతి తెలియజేశారు. ఈ కార్యక్రమంలో రైతు సంఘం జిల్లా అధ్యక్షులు కంచుమాటి అజయ్‌కుమార్, మండల కార్యదర్శి పూర్ణచంద్రరావు, జిల్లా కమిటీ సభ్యులు చింతల భాస్కరరావు పాల్గొన్నారు.

### శనగలను కొనుగోలు చేయాలని కోరుతూ ఆందోళన

**జమ్మలమడుగు :** రైతుల వద్ద ఉన్న శనగలను ప్రభుత్వం రైతు భరోసా ద్వారా తక్షణమే కొనుగోలు చేయాలని కోరుతూ ఎపి రైతు సంఘం ఆధ్వర్యంలో జమ్మలమడుగు మండల వ్యవసాయాధికారికి వినతిపత్రం అందించారు. 10 వేల ఎకరాల్లో పండిన శనగ పంటను తక్షణమే కొనుగోలు చేయాలని ఆ వినతిలో కోరారు. ఈ కార్యక్రమంలో ఎపి రైతు సంఘం జిల్లా ప్రధాన కార్యదర్శి బి.దస్తగిరిరెడ్డి ఇంకా ఘునిరెడ్డి, కృష్ణ, ధనుంజయ, ఎల్లయ్య బాలకృష్ణ, వినయ్ పాల్గొన్నారు.

### నిర్వాసిత రైతుల ధర్నా

**అనంతపురం :** అనంతపురం నుంచి భోగసముద్రం రోడ్డు కోసం 544-డి భూములిచ్చిన రైతులకు 2013 భూ సేకరణ చట్ట ప్రకారం పరిహారం ఇవ్వాలని కోరుతో కలెక్టరు కార్యాలయం ముందు నిర్వాసిత రైతులు ధర్నా నిర్వహించారు. ఈ కార్యక్రమంలో పలువురు రైతులు, నిర్వాసితులు పాల్గొన్నారు.

## ఏటికొప్పాక సుగర్స్ బకాయిలు చెల్లించాలి

ఏటికొప్పాక : విశాఖ జిల్లా ఏటికొప్పాక సుగర్ ఫ్యాక్టరీ రైతులకు, కార్మికులకు చెల్లించాల్సిన గత సంవత్సరపు బకాయిలు రూ. 18 కోట్లు చెల్లించాలని, ఫ్యాక్టరీని గానుగ ఆడేందుకు సిద్ధం చేయాలని కోరుతూ ఆందోళన నిర్వహించారు. ఈ ఆందోళనలో రైతులు, కార్మికులు పెద్ద ఎత్తున పాల్గొన్నారు. ఈ సందర్భంగా ఆందోళనా శిబిరం వద్ద ఎపి చెరకు రైతు సంఘం రాష్ట్ర అధ్యక్షులు కర్రి అప్పారావు ప్రసంగించారు. చెరకు బకాయిలు చెల్లించాలని, ఫ్యాక్టరీని తెరిపించాలని కోరారు.

## పత్తి పంట పరిశీలన

పోరుమామిళ్ల : నాసిరకం విత్తనాలతో పంట దెబ్బతింటున్న నేపథ్యంలో కడప జిల్లా పోరుమామిళ్ల మండలం కొరపాటి పల్లె గ్రామంలో ఎపి రైతు సంఘం నేతలు పత్తి పైరును పరిశీలించారు. రబీ సీజన్‌లో పత్తి వేసిన అనేక పొలాలను నాయకులు పరిశీలించారు. ఈ కార్యక్రమంలో కడప జిల్లారైతు సంఘం కార్యదర్శి బి. దస్తగిరిరెడ్డి, గ్రామప్రజలు పాల్గొన్నారు.

## నీరందించి పంటలను కాపాడండి

నాగార్జున సాగర్ కుడికాలువ ఆయకట్టు పరిధిలోని తంగెడ మేజర్ 21 బ్రాంచి కెనాల్ పూడుకుపోయిందున పూడిక తీయించి తాగునీరు, సాగు నీరు అందించే ఏర్పాటు చేయాలని ఎపి రైతు సంఘం నాయకులు స్థానిక శాసనసభ్యులు మహేష్ రెడ్డికి వినతిపత్రం సమర్పించారు. శాంతినగర్, కేశనపల్లి గ్రామాల్లో 400 ఎకరాలు నీరు అందక పంటలు దెబ్బతింటున్నాయని, కెనాల్‌లో పూర్తిగా పూడిక తీయించి సజావుగా నీటి సరఫరా జరిగేందుకు కృషి చేయాలని ఎమ్మెల్యేని కోరారు. దీనిపై అధికారులతో మాట్లాడతానని ఎమ్మెల్యే చెప్పారు. ఈ కార్యక్రమంలో ఏవూరి గోపాలరావు, జక్కుల వీరాస్వామి, టి. సుబ్బయ్య, కోలా నవజ్యోతి, ఇ. ఆంజనేయరాజు పాల్గొన్నారు.

## ఇసుక అక్రమ రవాణాను అరికట్టండి

పిచ్చాటూరు : చిత్తూరు జిల్లా పిచ్చాటూరు మండలంలోని ఎస్ఎస్‌బి పేట వద్ద ఇసుకను అక్రమంగా చేస్తున్న రవాణాను తక్షణమే అరికట్టాలని ఆంధ్రప్రదేశ్ రైతు సంఘం అధ్యక్ష, ప్రధాన కార్యదర్శులు హేమలత, జనార్థన్ ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. అక్రమంగా తరలిస్తున్న ఇసుక క్వారీలను ఎపి రైతు సంఘం, ఎస్ఎస్‌బి పేట వెల్ఫేర్ అసోసియేషన్ సంఘాల ఆధ్వర్యంలో పరిశీలించారు. అక్రమ మైనింగ్‌ను ఆపకపోతే దశలవారీ ఆందోళన చేపడతామని నాయకులు అన్నారు. వెల్‌ఫేర్ అసోసియేషన్ ప్రెసిడెంట్ చంద్రన్, కార్యదర్శి నరేష్, ఇంకా రంగరాజన్, ఓబులు గ్రామస్తులు పాల్గొన్నారు.

# రైతులపై 'నాసన్' దొంగదెబ్బ

అనంతపురం జిల్లాలో నాసన్ కంపెనీ ప్రతినిధులు అధికారులు, పోలీసులతో కుమ్మక్కై నిర్వాసిత రైతులను దొంగదెబ్బ తీశారు. సార్వత్రిక సమ్మె నేపథ్యంలో ఇటీవల ఉదయాన గోరంట్ల, సోమందేపల్లి, పెనుకొండ మండలాల్లోని వ్యవసాయ కార్మిక సంఘం, రైతు సంఘం, సిపిఎం, నాయకులను పోలీసులు ముందస్తు అరెస్టు చేశారు. ఇదే అదనుగా అధికారులు, పోలీసుల సాయంతో నాసన్ ప్రతినిధులు సోమందేపల్లి మండలం కావేటినాగేపల్లిలోని రైతుల భూములను స్వాధీనంలోకి తెచ్చుకునేందుకు చుట్టూ కంచె ఏర్పాటు చేశారు. నిర్వాసిత రైతులకు ఆర్ అండ్ ఆర్ ప్యాకేజీ ద్వారా న్యాయమైన పరిహారం ఇచ్చిన తరువాతే భూములను స్వాధీనం చేసుకోవాలని డిమాండ్ చేస్తూ వ్యవసాయ కార్మిక సంఘం, సిపిఎం ఆధ్వర్యాన మూడేళ్లుగా పోరాటం కొనసాగుతోంది. కోర్టులో కేసు నడుస్తోంది. ఇవేవీ పట్టని అధికారులు ఈ భూములను అప్పనంగా నాసన్‌కు అప్పజెప్పే కుట్రలో భాగస్వాములయ్యారు. నిర్వాసితుల పక్షాన ముందుండి పోరాడుతున్న అనంతపురం దక్షిణ ప్రాంత వ్యవసాయ కార్మిక సంఘం జిల్లా ప్రధాన కార్యదర్శి పెద్దన్నను అరెస్టు చేసి గోరంట్ల పోలీస్ స్టేషన్ కు తరలించారు. పలువురు భూ నిర్వాసిత రైతులను, సిపిఎం నాయకులను కూడా అరెస్టు చేశారు. సోమందేపల్లి, గోరంట్ల పోలీస్ స్టేషన్లకు తరలించారు. వీరందరూ పోలీసు స్టేషన్‌లో ఉన్న సమయంలో నాసన్ కంపెనీ బరితెగించింది. సోమందేపల్లి తహశీల్దార్ సురేష్, ఆర్ఐ నాగార్జునరెడ్డి, సిఐ, పోలీసుల బందోబస్తు నడుమ కావేటి నాగేపల్లిలోని భూముల చుట్టూ ఇనుప కంచెతో ప్రహరీ ఏర్పాటు చేసింది. అనంతరం నాయకులను పోలీసులు విడుదల చేశారు. దీనిని బట్టి పథకం ప్రకారమే అరెస్టులు జరిగినట్లు స్పష్టమవుతోంది.

## అక్రమ అరెస్టులపై వ్యకాస ఖండన

నాసన్ కంపెనీ నిర్వాసితులను, వ్యవసాయ కార్మిక సంఘం, సిపిఎం, నాయకులను అక్రమంగా అరెస్టు చేసి పోలీస్ స్టేషన్లకు తరలించడాన్ని ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ కార్మిక సంఘం (వ్యకాస) తీవ్రంగా ఖండించింది. ఈ మేరకు సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి వి వెంకటేశ్వర్లు ప్రకటన విడుదల చేశారు. శాంతియుతంగా పోరాడుతున్న నిర్వాసితులను అధికారులు భయాందోళనకు గురిచేస్తున్నారని పేర్కొన్నారు. ఒక్కొక్కరి ఇంటి వద్ద ముగ్గురు పోలీసులను పెట్టి నిర్బంధిస్తున్నారని, పోలీస్ స్టేషన్లకు తరలిస్తున్నారని తెలిపారు. నిర్బంధాల మధ్య నాసన్ కంపెనీ ప్రహరీ నిర్మాణ పనులు చేపట్టడాన్ని తీవ్రంగా ఖండిస్తున్నామని పేర్కొన్నారు. నిర్వాసితులకు అనుకూలంగా హైకోర్టు తీర్పునిచ్చినా, స్థానిక అధికారులు లెక్కచేయలేదని తెలిపారు. పోరాడుతున్న వారిపై నిర్బంధం విధించడాన్ని ఖండిస్తున్నామని, నిర్వాసితులకు న్యాయం జరిగేవరకూ పోరాటాలు కొనసాగుతాయని స్పష్టం చేశారు.

# రైతన్న తోడుగా కార్మిక రణం

పల్లవి...

మోగింది చూడరన్నో
సమ్మె సైరన్ నేడు....
కదులుతుందో రన్నో
కార్మిక లోకం చూడు

కూలీనాలీ ఏకం చేసి
రైతన్న తోడుగా రణం చేయగా మోగింది 2

చరణం -1

కార్మిక చట్టాల్ రక్షణ కోసం
కార్మిక హక్కుల సాధన కోసం
సి పి ఎస్ రద్దు కోసమై
పదపద మంటూ పరుగులు తీస్తూ మోగింది 2

చరణం 2

విశాఖ ఉక్కు కాపాడాలని
ఎల్ఐసినీ రక్షించాలని
ప్రభుత్వ రంగం పరిరక్షణకై
పిడికిలి బిగించి కదులుతున్నది మోగింది 2



- రెడ్డి శంకరరావు
సెల్ : 94 94 33 35 11

చరణం 3

పెరిగిన ధరలు కట్టడి కోసం
కనీస వేతన సాధన కోసం
తాత్కాలిక ఉద్యోగులందరినీ
రెగ్యులరైజు చేయాలంటూ... మోగింది 2

చరణం 4

స్త్రీలకు సమాన హక్కుల కోసం
స్కీమ్ వర్కర్ల భద్రత కోసం
కూలీలకు ఉపాధి చూపాలంటు
పంటకు మద్దతు ధర కావాలని మోగింది 2

చరణం 5

మూసిన మిల్లులు తెరవాలంటూ
నిరుద్యోగ నిర్మూలన కోసం
ముప్పైఏళ్ళ సంస్కరణలు
మట్టుబెట్టగా కదులుతున్నరు మోగింది. 2

# రా .. కదలి రా ..

లోకం విసిరిన చీకట్లను ఛేదిస్తేనే
తూరుపు వాకిట ఆశల పొద్దు పొడిచేది!
తీరం చేరే కెరటపుటంచుల్లోనే
ఆవేశం పట్టుదలై ప్రభవించేది!

- నాగభూషణ్ పాఢ
86887 78228



మున్నీటి మౌనం
కన్నీటి గుండెల్ని బద్దలు చేసిన నాడే
బతుకున అర్థం ధ్వనించేది!
శోకం తీర్చగ ఏకం కాగలిగిన నాడే
కోర్కెల శిశిరం వసంతమై చిగురించేది!

పోరాట వీచిక అభ్యుదయ
రాగమాలికయై పల్లవించగా
ఆశయ సాధనతో శృతి కలప వేల?
నియంతృత్వ నీడల్లో స్వేచ్ఛను కోల్పోయి
నిరాశల పంజరాన ఆ..... దైన్యం నీకేల?
భూషణ కాంతుల మధుర స్వప్నం
సత్యదూరం కాదంటూ ధైర్యంగా కదలి రావేల?
రాజ్యాంగ పుటలను
సైకత శిల్పాలుగా నిత్యం కూల్చేస్తూ
స్వయం ప్రకటిత ప్రజాస్వామ్య దేశాన
అప్రజాస్వామిక విధాన
కాదేదీ అమ్మకానికి అనర్హమంటూ
దేశమాత దేహాన
శోభించే ఆస్తుల ఆభరణాలను సైతం
ఒక్కొక్కటిగా అమ్మేస్తూ
అదే 'దేశ భక్తి'యని నమ్మకంగా నమ్మిస్తూ
భావి తరాలను ప్రపంచీకరణ భూతానికి
త్రికరణశుద్ధిగా బలి చేస్తూ
కార్మిక- శ్రామిక శ్వాసనే నిస్సిగ్గుగా నియంత్రిస్తూ
'విధ్వంసకర' విత్తుల్ని మొలకెత్తిస్తుంటే
అలసత్వమదియేల?

రా! కదలి రా! అంటూ సమర శంఖం పూరిస్తూ
పోరుబాటలో నినదిస్తూ చైతన్యమై ప్రజ్వరిల్లుతూ
వేయి ప్రశ్నల వెల్లువై
నియంతల వెన్నులో వణుకు పుట్టించవేల?

చేయి చేయి కలిపి ఒకరికొకరై నిలిచి
సామూహిక శ్రమైక నదిగా
జన జలపాతమై ప్రవహిస్తే-
కదలే కలవరపడదా?

# నీ చరిత నిలిచేనులే

- డా. కె. దివాకరాచారి,
అట్లాంటా, యుఎస్
93910 18972

ఆందోళనయే ఊపిరిగా
మహిళా శక్తికి మారుపేరు
రైతు, కూలీల, పీడితుల, పక్షాన నిలిచి
ప్రజల కోసమే బతికిన వీరనారి



మూడు తరాలకు ప్రేరణగా
పోరాటమే ఊపిరిగా
జీవితమే ఆందోళనగా
పీడితుల కోసం అనాడు
నిజాం నిరంకుశ పాలనను
రజాకార్ల దాష్టీకాలను చెండాడగ
బందూకు పట్టిన తెలుగు ఆడబిడ్డ

గిరిజన మహిళల్లో
చైతన్య జ్వాలల్ని రగిలించి
రైతాంగ సాయుధ పోరాట ఝాన్సీవై
దళాలను ఎర్ర దండులా
నడిపిన కమాండర్ నీవు

ఉమ్మడి రాష్ట్ర అసెంబ్లీలో
మహిళా ప్రతినిధిగా
మచ్చలేని నాయకుడు సుందరయ్య
అడుగు జాడల్లో నీ వాణిని
నలుచెరగులా వినిపించిన ధీశాలివి
పిడికిలెత్తి అన్యాయాలపై
గళమెత్తిన యోధురాలివి

పుట్టింది ఎక్కడైనా
బతుకును మాత్రం బడుగుల కోసం
ధారపోసిన త్యాగశీలివి
తెరచిన నీ బతుకు పుస్తకం
'నా మాటే తుపాకి తూటా'
అణచివేతను అన్యాయాలను
ధిక్కరించే మహిళా శక్తికి వేగుచుక్క

ఏరుపెక్కిన పాటలా
ఎగురుతున్న అరుణ పతాకంలా
ఎత్తిన పిడికిలిగా లోకాన
నీ చరిత సదా నిలిచేనులే!

Printed & Published by B. Tulasi Das on behalf of A.P. Rytusangam, 3/4B, Bypass Road, Vaddeswaram, Tadepalli, Guntur Dt, A.P.
**At** Prajasakti Daily Printing Press, Krishna nagar, Tadepalli (M), Guntur (Dt.,) **Editor** : P. NarasimhaRao

# మార్చి - 28, 29 తేదీలలో జరిగిన అఖిలభారత సమ్మె దృశ్యాలు



విజయవాడలో




విశాఖలో




కర్నూలులో




గుంటూరులో




చిత్తూరులో




అనంతపురంలో




ఆకివీడు (ప.గో.జిల్లా)




సీతం పేటలో

KLVA106m238

Book Post - Printed Matter

MANARYTUVANI R.NI. 52715/90

# మన రైతువాణి

వ్యవసాయ మాసపత్రిక




వెల : రూ. 25/- పేజీలు : 52
సంవత్సర చందా : రూ.250/-





3/4B, Vaddeswaram Bypass , Vaddeswaram (Post), Tadepalli (Mandal), Guntur Dt, A.P.



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA106M238 |
| పుస్తకం పేరు | రైతువాణి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | madhu |
| పేజీలు విడదీసినది | madhu |
| స్కాన్ చేసినది | Navya |
| పరీక్ష చేసినది | AMRUTHA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |